చి.ఆ.రేకు: 0001-01 వరాళి సం: 10-001

పల్లవి: రామ రామచంద్ర రాఘవా రాజీవలోచన రాఘవా
సౌమిత్రి భరతశతుఘ్నులతోడ జయమందు దశరథరాఘవా

చ. 1: శిరసు కూఁకటుల రాఘవా చిన్నారిపొన్నారి రాఘవా
గరిమ నావయసున తాటకిఁ జంపిన కౌల్యనందన రాఘవా
అరిది యజ్ఞముగాచి రాఘవా యట్టె హరునివిల్లువిరిచినరాఘవా
సిరులతో జనకునియింట జానకిఁ జెలఁగి పెండ్లాడినరాఘవా

చ. 2: మలయు నయోధ్యారాఘవా మాయామృగాంతక రాఘవా
చెలఁగి చుప్పనాతిగర్వ మడఁచి దైత్య సేనల జంపిన రాఘవా
సొలసి వాలిఁజంపి రాఘవా దండి సుగ్రీవు నేలిన రాఘవా
జలధి బంధించిన రాఘవా లంకసంహరించిన రాఘవా

చ. 3: దేవతలుచూడ రాఘవా దేవేంద్రురథమెక్కి రాఘవా
రావణాదులనుఁ జంపి విభీషణు రాజ్యమేలించిన రాఘవా
వేవేగ మరలి రాఘవా వచ్చి విజయపట్టమేలి రాఘవా
శ్రీవెంకటగిరిమీద నభయములు చెలఁగి మాకిచ్చిన రాఘవా

చి.ఆ.రేకు: 0001-02 బౌళి సం: 10-002

పల్లవి: గోవింద గోవింద యని కొలువరె
గోవిందా యని కొలువరె

చ. 1: హరి యచ్యుతా యని యాడరె
పురుషోత్తమా యని పొగడరె
పరమ పురుషా యని పలుకరె
సిరివర యనుచును జెలఁగరే జనులు

చ. 2: పాండవ వరద యని పాడరె
అండజ వాహనుఁ గొనియాడరె
కొండలరాయనినే కోరరె
దండితో మాధవునినే తలఁచరె జనులు

చ. 3: దేవుఁడు శ్రీవిభుఁడని తెలియరె
సోవల ననంతునిఁ జూడరె
శ్రీవేంకటనాధునిఁ చేరరె
పావనమై యెప్పుడును బ్రదుకరే జనులు

చి.ఆ.రేకు: 0001-03 దేసాక్షి సం: 10-003

పల్లవి: ఎన్నటికి నీకు జీవుఁడా యిదియె బుద్ధి వోజీవుఁడా
మన్నించిన నీగురువులపాదము మఱవకువో వోయిజీవుఁడా

చ. 1: మాటచెప్పేద జీవుఁడా మారు మాఁటలేటికి జీవుఁడా
నాటకంబుల పంచేంద్రియముల నమ్మకు వో వో జీవుఁడా
చాటితిఁ జుమ్మీ జీవుఁడా నీకుఁజాటువో హరిభక్తి జీవుఁడా
కూటువగూడిన కామక్రోధాదులఁ గూడకువో వోయిజీవుఁడా

చ. 2: ఎప్పుడు మనసులో జీవుఁడా హరిఁ దప్పక తలఁచవో జీవుఁడా
తప్పుఁదెరువుల దేవతాంతరాలు దడవకువో వోయిజీవుఁడా
దప్పిఁబడనేల జీవుడా నీవు ధన్యుఁడ వవుదు వోజీవుఁడా
చిప్పిలువేడుక శ్రీవెంకటనాథు సేవించవో వోయిజీవుఁడా

చి.ఆ.రేకు: 0001-04 గుజ్జరి సం: 10-004

పల్లవి: మచ్చరములుఁ గపటంబులు మానినంత మరికదా
విచ్చలవిడి నాయాసల వీఁగఁదోల నోపుటా

చ. 1: చంచలమగు నామనసిది మంచిదైన మరికదా
పంచేంద్రియముల పోరునఁ బడకమానుటా
కొంచెపరచునాకోపముఁ గోసివేసి మరికదా
కంచపుఁ బాపంబులలోఁ గడతేరుటా

చ. 2: పుడివోని దీపనమున కోరిచినె మరికదా
జడివట్టిన నాజిహ్వాచాపల్యము మానుటా
చిడుముడి నాభోగంబులఁ జిక్కువడక మరికదా
విడువని సంసార మనెటివెల్లి దాఁటనోపుటా

చ. 3: తరితీపులమోహంబునఁ మరికదా
కెరలిన యీలోభంబున గెలువ నోపుటా
నెరవుగ శ్రీవిష్ణుభక్తి నిలుకడైన మరికదా
గరగరికలనె శ్రీవెంకటనాథునిఁ జేరుటా

చి.ఆ.రేకు: 0001-05 దేవగాంధారి సం: 10-005

పల్లవి: ఏమొకొ నేమేమొకో
యీ మోహము మానమేమొకో

చ. 1: కావరించినట్టి కాఁపురములలో
నీవలావలయ్యే మేమొకో
దావతిసుఖముల దారి దెలిసియు
నేవగించలే మేమొకో

చ. 2: గాలపుఁజిక్కుల కర్మపుతొడసుల
యీలకరచే మేమొకో
తాలిమిచెరిచెటి ధనముమీఁదివాంఛ
యేలొ యింకా మాన మేమొకో

చ. 3: వోడుపోయినట్టి వుంగిటిబతుకుల
యీడగిలఁబడే మేమొకో
వేడుకతో శ్రీవెంకటనాథుఁడు
యీడనె మముఁ గాచె నేమొకో

ఛి.ఆ.రేకు: 0002-01 మలహరిసం: 10-006

పల్లవి: హరికి మొరవెట్టితె అన్నిపనులు లెస్సవును
సరవి నెన్నాళ్లని జాలిఁ బడవచ్చును

చ. 1: యేమిసేయేనీజీవుఁ డీయరివర్గాలతోడ
బూమెల నెన్నాళ్లని పోరాడీని
చూమరలఁ జూడఁ జూడఁ జుట్టాలవలనె వుండి
దోమటిపంచేంద్రియాలు దోడుగాకపోయను

చ. 2: యెక్కడచొచ్చీజీవుఁడీ కర్మపురుణములు
పెక్కు విధములఁ బిరువీకు సేయఁగా
వొక్కొక్కనాఁటివడ్డె వొదిగీఁగాని తల
తిక్కగొన్న పాపములు దీరకెపోయను

చ. 3: యెవ్వరుదిక్కీ జీవుని కెంతని యీఁదఁగలఁడు
యివ్వల సంసార మనె యీవారిధి
నవ్వుతా శ్రీవెంకటనాథుని మఱఁగుచొచ్చి
యివ్వగఁ దా దరిచేరి యిన్నియు గెలిచెను

చి.ఆ.రేకు: 0002-02 సామంతం సం: 10-007

పల్లవి: మాజహిహి దుష్టమనాయితి
యోజయ తవపదయుగామృతేన

చ. 1: పరమాత్మన్ మమపామరచిత్తం
చిరం పాపం చికీర్షతి
కరుణానిధేర్యకారణబంధో
గురుతరాం కృపాం కురు మయి దేవ

చ. 2: అంతర్యామి హరే మదాశా
సంతపఏవ సమేధతే
దాంతికరానంతగుణానిధే
భ్రాంతిం వారయ పావనచరిత

చ. 3: నలినోదర మాం నానామోహా
విలసత్కృతీవ విమోహయ
కలిత శ్రీవెంకటనాథ త్వం
సలలితం ప్రసాదయ స్వామి

చి.ఆ.రేకు: 0002-03 దేవగాంధారి సం: 10-008

పల్లవి: ఎవ్వరుచెప్పినా మనసేల మానును
యివ్వలవ్వలౌఁగాక యేలమానును

చ. 1: కమ్ముకొన్న యింద్రియాలు గారడించఁగా జీవుఁ
డెమ్మెలఁ బొరలక మరేల మానును
యిమ్ములేనికోరికలు యెక్కెక్కు లాడఁగాను
వుమ్మడికర్మాలుసేయ కూర కేల మానును

చ. 2: పేరడిమదములెల్లా పెనగొనఁగా నొరుల
నీరసించ కీ దేహి యేలమానును
తీరనిచలము లివి తెలివి చెరుచఁగాను
యేరవెట్టుకొనియుండ కేలమానును

చ. 3: వుడివోనియాసలు వొత్తుకోలుసేయఁగాను
యిడియక యీప్రాణుఁ డేలమానును
కడువేగ శ్రీవెంకటనాథుఁడు గావఁగా
నెడయక కని మన కేలమానును

చి.ఆ.రేకు: 0002-04 మలహరిసం: 10-009

పల్లవి: హిత విదె తెలుసుకొమ్మీ
సతతముఁ జాటితిని

చ. 1: సేయవోయిజిహ్వ యీశ్రీహరి నుతియెపుడూ
రోయవోయి నీవు యీరుచుల యందలి వేడుకా

చ. 2: కోరవోయి మనసా యిఁక గోవిందుని చింతా
చేరకువోయి నీవు యీ చెడుగుఁ గామాదులను

చ. 3: విడువకువోయి దేహి శ్రీవెంకటగిరినాథుని
వుడుగవోయి నీవు యీవులుకుఁ దొల్లిటిచేఁతలు

చి.ఆ.రేకు: 0002-05 గుజ్జరి సం: 10-010

పల్లవి: ఎంతలే దిది యెంచిన
సంతోషించని సంసారంబు

చ. 1: యేలకొ నేఁ డీదేహి
ఆలరి భోగము లడిగీఁగాక
చాలించఁగఁ జాలఁడు
కోలుముందు హరిఁ గొలువఁగరాదా

చ. 2: యెందైనను యీమనసు
పందదనంబునఁ బారీఁగాక
ముందరికోరిక మునుఁగదు
కందువ శ్రీవిభుఁ గానఁగరాదా

చ. 3: విడువనితగు లీవేడుక
తొడిఁబడ నెందైన దొరసీఁగాక
కడగని శ్రీవెంకటనాథు
బడిబడిఁ దిరుగుచు బ్రదుకఁగరాదా

చి.ఆ.రేకు: 0002-06 బౌళి సం: 10-011

పల్లవి: బ్రహ్మఁగన్న వాఁడు పసిబిడ్డ
బ్రహ్మమైనవాఁడు పసిబిడ్డ

చ. 1: వగపులేక చంపవచ్చిన బూతకి
పగసాధించినవాఁడు పసిబిడ్డ
పగటునఁ దనమీఁదఁ బారవచ్చినబండి
పగులఁ దన్నినవాఁడు పసిబిడ్డా

చ. 2: గుట్టున నావులకొరకు వేలనె కొండ
పట్టి యెత్తినవాఁడు పసిబిడ్డా
జెట్టిపోరునఁ దన్ను జెనకవచ్చినవానిఁ
బట్టి చంపినవాఁడు పసిబిడ్డా

చ. 3: మిడికెటికోపపు మేనమామఁ బట్టి
పడనడిచినవాఁడు పసిబిడ్డా
కడువేగ శ్రీవెంకటనాథుఁడై గొల్ల
పడఁతులఁ గూడినాఁడు పసిబిడ్డా

చి.ఆ.రేకు: 0002-07 లలిత సం: 10-012

పల్లవి: చెప్పే నామాట విను చిత్తమా
చిప్పిలు నెండమావుల చెరువులు నున్నావా

చ. 1: వెగటైనవిషయాల వేడుకపడకు మవి
జిగురుఁగండెలు సుమ్మీ చిత్తమా
పొగరుమూఁపుఁదనాలఁ బొరలకు మవియెల్ల
తగులు విరిపందెల దారివంటివి

చ. 2: బలిమినె యాసలబారిఁ బడకు మవి
చిలుకల వోఁదా లోచిత్తమా
తలఁచిచూచితేనె తప్పులుఁ దారులె
కలలోని రతులయాఁకట వంటివి

చ. 3: మేరమీరెకోరికల మిసిమి చూడకు మవి
జీరుకుబండ లోయిచిత్తమా
చేరువనె కాచెటి శ్రీవెంకటనాథుఁగని
గారవాన బ్రదుకుమీ కల్పవృక్ష మతఁడు

చి.ఆ.రేకు: 0003-01 లలిత సం: 10-013

పల్లవి: పచ్చిగాఁ దెలియకుంటె బహుముఖమై తోఁచు
అచ్చమై యిన్నియును శ్రీహరి కల్పితములే

చ. 1: కొందరు దిట్టుదురూ కొందరు దీవింతురు
చందపుసంసారము జాడలివి
కందువ రేయీఁ బగలుఁ గాలము నడచినట్టె
అందరిలో గలుగు శ్రీహరికల్పితములే

చ. 2: కొన్నిట్టిపైకోపము కొన్నిటి పైవేడుక
వున్నతి దేహధారుల వోజ లివి
పన్ని కాయ పండు దొండపంటియందె తోఁచినట్టు
అన్నియుఁ బుట్టించిన శ్రీహరికల్పితములే

చ. 3: కొంతచోట మనుజులు కొంతచోట దేవతలు
అంతా శ్రీవెంకటనాథు నాజ్ఞ యిది
చెంత చప్పనయుఁ దీపు చెఱకందె వుండినట్టు
కాంతుఁడైన శ్రీహరికల్పితములే

చి.ఆ.రేకు: 0003-02 వరాళి సం: 10-014

పల్లవి: మాఁటిమాఁటికిఁ జూచి మరపులేలె
నీటునఁ బాటిగంప నీళ్లు మోచేవా

చ. 1: తెలిపేగురుఁ డుండఁగ తెలియఁగ నేరవు
చిలుకచదువులే లోజీవుఁడా
అలవోక నెందైన ఆస మానలేవు
కల గన్నచోటి కెల్ల గంపయెత్తేవా

చ. 2: వొబ్బిడైనవేదమార్గ మొల్లనిపుణ్య మంటేవు
జిబ్బిటాయతప మేలె జీవుఁడ
అబ్బురపువేడుకల నలుసేవు పలుమారు
గబ్బివై పారేబండికిఁ గాలు చాఁచేవా

చ. 3: వొల్లనెసంసారములో నూరకె గర్వించేవు
చెల్లఁబో రొయ్యకోవ్వేలె జీవుఁడా
నల్లని శ్రీవెంకటనాథుని బంటవైతివి
తల్లకిందేల మేరువు తలగడనుండఁగా

చి.ఆ.రేకు: 0003-03 గుజ్జరి సం: 10-015

పల్లవి: చంచలమతులకుఁ దెలియునే సాత్త్వికధర్మములు
మంచమునీడవలె బహుమార్గములై తోఁచున్

చ. 1: తీపుల అల్పపుచదువుల తెలివేలా కలుగు
కాపై మిడుఁగురుబురువులఁ గడచునె చీఁకట్లు
పైపై ప్రాకృతదృష్టికి పరమేలా కలుగు
పాపము కనుమాయలవలె భ్రమయించుఁ గాక

చ. 2: కొద్దెరఁగని జడునికి సద్గుణ మేలా కలుగూ
అద్దము చిలు ముబ్బినక్రియ అజ్ఞానము వొడమున్
నిద్దము కామాతురునకు నిజ మేలా తెలియూ
వద్దనె యండమావులవలెఁ దోఁచుఁ గాక

చ. 3: అనువుగ నక్షయపుణ్యము అది యేలా చెడును
పెనఁగెటి తననీడవలెనె పెడవాయదు యెపుడు
ఘనుఁడగుజీవుఁడు శ్రీవెంకటనాథునిఁ గని నా
పనివడి రత్నము సానఁబట్టినగతిఁ జెలఁగున్

చి.ఆ.రేకు: 0003-04 సామంతం సం: 10-016

పల్లవి: అల్లము బెల్లమౌనా అన్నలాల
యెల్లకాలమును గుణ మేల మానీనయ్యా

చ. 1: నిక్కము గొండలనీరు నేలకు వేగమె పారు
యెక్కువనేలపై నీరు యెక్కు దండుకు
మిక్కిలి ప్రకృతిలోన మెలఁగెటివానికి
చొక్క మైనజ్ఞాన మెట్టు సొగసీనయ్యా

చ. 2: అచ్చపుఁబాలలోన తోడంటితేనె పెరుగౌను
పచ్చి సేసినఁ బెరుగు పాలు గాదు
వచ్చి వచ్చి యెఱఁగనివానికిఁ దెలుపవచ్చు
కుచ్చితుని నెటువలె గుణిఁ జేసేదయ్యా

చ. 3: చందనపువానలు సంగడి మాఁకుల నంటు
అందలివాన లిందు నంట వెన్నఁడు
కందువైన శ్రీవెంకటనాథుని దాసు
లెందుండినా నితరము లేల తోఁచీనయ్యా

చి.ఆ.రేకు: 0003-05 బౌళి సం: 10-017

పల్లవి: తనకోరిక లేఁటికి నాతఁడె యిన్నియుఁ గల్పించఁగ
అనువుగ నిందుకు యిద్దరియత్నంబులు వలెనా

చ. 1: అద్దముచూచెటియాతఁ డలరుచు నవ్విన నవ్వును
అద్దములోపలినీడయు నారీతినె కాదా
గద్దరియగు శ్రీవిభుసంకల్పంబుననె జగముల
సుద్దులు దుఃఖము సుఖమును సూటిఁబఁడె గానా

చ. 2: నాఁటక మాడించునతఁడు నయమునఁ గదలింపంగా
నాఁటక మందలిబొమ్మలు నానాగతిఁ జెలఁగున్
ఆటలఁ జేతన్యాత్మకుఁడగు దేవుని చేష్టలనె
పాటిగఁ బాపముఁ బుణ్యము బహుళం బగుఁగానా

చ. 3: అరదము నడపెటిసారథి యటునిటు వాగెటు వట్టిన
అరదముగుఱ్ఱములు మెలఁగు నాయామునఖములను
నరులను శ్రీవెంకటగిరినాథుఁడె తగ బ్రేరింపఁగ
గరవము లేమియుఁ గలిమియుఁ గలిగుండుఁ గానా

చి.ఆ.రేకు: 0003-06 మలహరిసం: 10-018

పల్లవి: తలఁ పెన్నఁడు నినుఁ దగులునయ్యా
చల మెన్నఁడు కడచనునోయయ్యా

చ. 1: మోహం బెన్నఁడు ముదుసునయ్యా
దాహం బెన్నఁడు తలఁగునయ్యా
సాహస మెన్నఁడు జరగునయ్యా
శ్రీహరి తెలియఁగ జెప్పఁగదయ్యా

చ. 2: కపటం బెన్నఁడు గడచునయ్యా
చపలత లెన్నఁడు జారునయ్యా
నిపుణత లెన్నఁడు నెగడునయ్యా
ప్రపంచముగ హరి పలుకఁగదయ్యా

చ. 3: మచ్చర మెన్నడు మానునయ్యా
నిచ్చల మెన్నఁడు నిలుచునోయయ్యా
గచ్చుల శ్రీవెంకటనాథ
పచ్చిదేర హరి పలుకఁగదయ్యా

ఛి.ఆ.రేకు: 0004-01 లలిత సం: 10-019

పల్లవి: కుడువనికుడుపులు కొనసాగె మమతలు
కడువేగ శ్రీహరిఁ గానఁగవలదా

చ. 1: నమలక చవులయ్యె నాతుల సుద్దులు
అమర చింతకాయలవంటివి
భ్రమసి కొరుకఁబోతె పండ్లు పులుసును
తెమలక శ్రీహరిఁ దెలియఁగ వలదా

చ. 2: విచ్చక మెరుఁగులు విడివడ్డ వలపులు
పచ్చి మేడిపంటి భావములివి
మెచ్చి లోను చూడ మెదలుపురువులె
గచ్చుల యివి మాని కనవద్దా హరిని

చ. 3: బడలని పంట వో పైపైనే హరిభక్తి
కడలేని కల్పవృక్షమువంటిది
కడఁగి కొలువ శ్రీవెంకటనాథుఁడె గురి
బడినె యీతనిఁ గని బ్రదుకఁగ వలదా

చి.ఆ.రేకు: 0004-02 మలహరిసం: 10-020

పల్లవి: సంకె లేక తలఁచిన జాణలకు
సంకీర్తనమెపో సర్వశాంతి

చ. 1: భవహరమగు శ్రీపతి నామమె
జవకట్టి తలఁచితే జన్మశాంతి
తవిలి హరిపూజ తాఁ జేయుటె
కువలయమున నిదిగో గృహశాంతి

చ. 2: అంది ధ్రువవరుఁదుడ యనినదే
కందువైన సర్వగహశాంతి
యిందురవినయనుని నెరుఁగుటె
చందమైన దిదివో నక్షత్రశాంతి

చ. 3: భావించి యనంతునిఁ బలుకుటే
కావించిన దిదివో కాలశాంతి
శ్రీవెంకటనాథునిఁ జేరుటె
దేవమానవులకును దేహశాంతి

చి.ఆ.రేకు: 0004-03 మాళవిగౌళ సం: 10-021

పల్లవి: మనసె వశమైతేఁగా మరి మీఁదటిపనులు
తనువులోపలి హరిదయ యింతె కాకా

చ. 1: వొద్దనె పుత్రమిత్రాదు లువ్విళ్లూరించఁగాను
అద్దో వైరాగ్య మేమి ఆటపాటలా
కొద్దిలేనివిషయాలు గుంపు గూడు కుండఁగాను
వద్దని కడకుఁ దోయ వశ మవునా

చ. 2: వొయ్యనె ధనధాన్యాలు వొడ్డుకొని వుండఁగాను
అయ్యో సుజ్ఞానము లల్లాడఁబడెనా
గయ్యాళికోరిక లెల్లా గమిగూడ కుండఁగాను
పుయ్యక దూలయాసలఁ బోఁదోల వసమా

చ. 3: పల్లదపుటాఁక లిది పాయక వుండఁగాను
చెల్లఁబో వోరుపు లింత చెడఁబోయనా
నల్లని శ్రీవెంకటనాథుఁడె యందరికిని
తల్లి దండ్రియై కావఁగా తప్పువాసెఁ గాకా

ఛి.ఆ.రేకు: 0004-04 రామక్రియ సం: 10-022

పల్లవి: భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సవరని పైఁడిపక్షిసకినగాఁడు

చ. 1: తల్లి వద్ద నోరిలోన తగ లోకములు చూపి
వెల్లవిరి నింద్రజాలవిద్యవాఁడు
చెల్లుబడి నొక్కకొండ చేతఁ బట్టి యెత్తినాఁడు
బల్లిదుఁడు వాడివో బారివిద్యవాఁడు

చ. 2: మునుపె సకలభూతములను నేలికయ్యె
మనసెల్లా నెరిగిన మంత్రవాది
చనవున జలధిలో సంప దింద్రునికిఁ జూపె
అనువరి వాఁడివో అంజనగాఁడు

చ. 3: పట్టరాని కాళింగుపడిగెలమీఁదు మెట్టి
పట్టినాఁడు వాఁడువో పాములవాఁడు
అట్టె శ్రీవెంకటనాథుఁ డమరుల నెల్లనుఁ జే
పట్టి దైత్యులఁ జంపించే పాళగాఁడు

చి.ఆ.రేకు: 0004-05 సాళంగనాట సం: 10-023

పల్లవి: అప్పనివరప్రసాది అన్నమయ్యా
అప్పసము మాకె కలఁ డన్నమయ్యా

చ. 1: అంతటికి నేలికైన ఆదినారాయణుఁ దన
యంతరంగాన నిలిపీ నన్నమయ్యా
సంతసానఁ జెలువొందె సనకసనందనాదు
లంతటివాఁడు తాళ్లపాకన్నమయ్యా

చ. 2: బిరుదు టెక్కెములుగా బెక్కు సంకీర్తనములు
హరిమీఁద విన్నవించె నన్నమయ్యా
విరివిగలిగినట్టి వేదముల యర్థ మెల్లా
అరసి తెలిపినాఁడు అన్నమయ్యా

చ. 3: అందమైన రామానుజాచార్యమతమున
అందుకొని నిలిచినాఁ డన్నమయ్యా
విందువలె మాకును శ్రీవెంకటనాథుని నిచ్చె
అందరిలో దాళ్లపాక అన్నమయ్యా

చి.ఆ.రేకు: 0004-06 దేవగాంధారి సం: 10-024

పల్లవి: నేరి చెవ్వఁడు బ్రదికె నేరక యెవ్వఁడు చెడె
భారకుఁ డందరికి శ్రీపతి యింతె కాక

చ. 1: వొక్కరి నేరము లైతె నూరకె వెడకఁ జూచే
నక్కటా నాగుణదోషా లవి యెంచను
వొక్కటై విచారించితే వొరు లేమి తా నేమి
అక్కడ నిక్కడ గురి హరి యింతె కాక

చ. 2: దట్టిచి వొక్కరి నైతె తప్పు లెంచఁ జూచేను
అట్టే నాయపరాధాల కాజ్ఞ యేదో
నెట్టనఁ దలపోసితే నేనేమి పరు లేమి
గట్టిగా స్వతంత్రుడు శ్రీకాంతుఁ డింతె కాక

చ. 3: వూరకె వొక్కరి నైతే వొచ్చములు వట్టేను
కారుకమ్మినట్టి నాకల్ల లెంచను
గారవించి శ్రీవెంకటనాథుఁడు నన్ను
సారెకు రక్షించఁగాను జయ మాయఁ గాకా

చి.ఆ.రేకు: 0005-01 గుండక్రియ సం: 10-025

పల్లవి: వట్టివిచారము లేల వలవని చింత లేల
దిట్టతనాన రక్షించ దేవుఁ డుండఁగాను

చ. 1: తానె బుద్దెరిఁగితే తప్పులేల వచ్చీని
మానక యేలిక లెస్స మన్నించుఁ గాక
మేనిలోఁ బాపము లేక మించిన భయ మేఁటికి
ఆనుకొని రక్షించ శ్రీహరి యుండగాను

చ. 2: చేరి తానె కొలిచితే జీత మేల తప్పీని
భారకుఁడై దొరయే చేపట్టుఁ గాక
మారుముద్ర గాని మంచిమాడకు వట్టము లేల
తారుకాణగా హరి తానె రక్షించుఁ గాక

చ. 3: చనవె కలిగితేను సలి గేల తప్పీని
తన చెప్పినట్టు రాజు తాఁ జేసుఁగాక
పనివడి రాచవారి పనులకు బందె యేది
నను శ్రీవెంకటగిరినాథుడు రక్షించఁగా

చి.ఆ.రేకు: 0005-02 గౌళ సం: 10-026

పల్లవి: నిచ్చలూఁ జెడనియట్టి నీకె తెలుసుఁ గాక
యిచ్చల మావంటివా రేమెరుఁగుదు రయ్యా

చ. 1: బాలుఁడు వృద్ధనియెటి పరిభాష లన్నియును
మూలమూలలను దేహమునకె కాక
యీలో నెంచి చూచితే నెన్నటివాఁడు
కోలుముంద్దై పెరిగీనో కొంచె మయ్యానో

చ. 2: మంచిది చెడ్డ దనెటిమాఁట లెల్లా భువిలోన
యెంచి చూడ మనుజుల కింతె కాక
నించి సర్వపూర్ణుఁడవై నీవు లేనిచోటేది
తుంచరాదు పెంచరాదు తొల్లె కలవు

చ. 3: వాఁడు వీఁడనియెటివచనాలు జగములో
పోఁడిమి జీవులయందె పొసఁ గెఁ గాక
వేఁడినా కొసరినాను విశ్వవ్యాపకుఁడవై
నాఁడు నేఁడు శ్రీవెంకటనాథుఁడవె కలవూ

చి.ఆ.రేకు: 0005-03 నారాయణదేసాక్షి సం: 10-027

పల్లవి: ఐన దేది కాని దందులో నేది
నానారూపి శ్రీనాథుఁడె కాకా

చ. 1: యెవ్వరి దూషించే మెవ్వరి భూషించే
మెవ్వరు స్వతంత్రు లిందులో
అవ్వల నివ్వల నంతరాత్ముఁడైన
యవ్వనజాక్షుని నసుట గాకా

చ. 2: యెందుకుఁ గోపించే మెందుకు మెచ్చే
మెందుఁ గద్దు మే లిందులో
అందు నిందుఁ దానె యల్లుకొన్న
నందనందనునే నమ్ముట గాకా

చ. 3: యేచోటు మంచిది యేచోటు చెడ్డది
యేచోటు సతమౌ నిందులో
కాచేటి శ్రీవెంకటనాథుఁడె
చేచేతఁ గాణాచై చెల్లించెఁ గాకా

చి.ఆ.రేకు: 0005-04 గుజ్జరి సం: 10-028

పల్లవి: చలమె చెల్లించుకొన్న సతులాల
సులభమా మీతోపొందు సుతులాల

చ. 1: వ్రతినైన యతినైన వలలమాటలఁ బెట్టి
బతిమి చెరుతురుగా బంధువులాల
హితవరులువలెనె యింత నంత నెలయించి
తతిగొందురుగా ధనధాన్యములాల

చ. 2: పెద్దనైన పిన్ననైన పెలుచుఁదనమె రేఁచి
కొద్దిమీరించిన కామక్రోధములాల
అద్దొ యెంతవిరక్తు నైనా విషయాలకె
తిద్దితిరిగా పంచేంద్రియములాల

చ. 3: మునినైన ఋషినైన మోహమె పెంచి మరపి
మొనసితిరిగా యిల్లు ముంగిళ్లాల
ఘనుఁడైన శ్రీవెంకటనాథుపాదములు
చనవునఁ జూపతి రాచార్యులాలా

చి.ఆ.రేకు: 0005-05 మలహరి సం: 10-029

పల్లవి: నిండునిధానమువలె నీవు గలిగుండఁగాను
పండినయోగికిఁ బూర్ణభావనె మంచిది

చ. 1: కలకాలము భూమిఁ గతలె వింటిమిగాని
నలనహుషాదు లున్నారా యేమి
యిలలో నితరు లెల్లా నేమి లేక్క యిందుకుఁగా
యెలయింపువిషయాల యేమరఁగఁ దగునా

చ. 2: చేపట్టి పురాణాలు చెప్పఁగా వింటిమి గాని
బాపురె దుర్యోధనుసంపద యేది
కాపాడ నిప్పటివారికలిమి యెంచఁగ నేది
యీపాటిపనికిఁగా నిది గోరఁ దగునా

చ. 3: మళ్లీ మళ్లీ భూమిలోన మాటలె వింటిమి గాని
తొల్లిటి బలాఢ్యుల సత్తువ లేవి
వెల్లవిరై యెప్పుడూ శ్రీవెంకటనాథ నీదాసు
లెల్లకాలముఁ జెడని యీబలిమె నిజము

చి.ఆ.రేకు: 0005-06 లలిత సం: 10-030

పల్లవి: బండించితేఁ గలుగునా పరమాత్మునిదాస్యము
నిండుమతి నుండితేను నెరవేరుఁ గాక

చ. 1: బాధకు నోపనివాఁడు పాపము సేయ నేల
పోది సేయఁ దొలుతేమి బుద్ధి లేదా
సాదువలె నుండితేను సర్వేశ్వరుఁడె తన్ను
వాదులాట లెల్ల మాన్పి వహించుకో లేఁడా

చ. 2: దండుగ కోపనివాఁడు తప్పులు సేయఁగ నేల
వుండరాదా తా నుండె వొడికానను
కొండవంటి యాసతోడ కోరక తా నుండితేను
తండు ముండ్లై లంపటాలు తగిలీనా తనకు

చ. 3: వళుకు కోపనివాఁడు వచ్చి పూఁటవడ నేల
వొలిసినట్లు తనంత నుండరాదా
కలకాలము శ్రీవెంకటనాథుఁ గొలిచితె
అలరి యభయ మిచ్చి అట్టె కావ నోపఁడా

చి.ఆ.రేకు: 0006-01 గుజ్జరి సం: 10-031

పల్లవి: వద్దుసుమ్మీ చెప్పితిని వలలఁ బడఁగ వద్దు
పెద్దరికాన దేవునిఁ బేరుకొన రాదా

చ. 1: పల్లదపు సంసారానఁ బాయలేక తిరిగేవు
చెల్లఁబో జీవుఁడ యింకా సిగ్గు గాదుగా
వెల్లవిరి నింతయాల వెనకముందరిపాటు
దళ్లాలితనము మాని తలఁచుకో రాదా

చ. 2: వెయ్యైనా మీఁద మీణద వేసరక కోరేవు
అయ్యో యింకా నిందు కాసపడేవా
వొయ్యనె వెనకజన్మ మొక్కటొక్క టెంచి చూచి
తియ్యని విష్ణుభక్తి తెలుసుకో రాదా

చ. 3: యేపు మీరి యేమైనా నింపులు సేసుకొనేవు
పో పో యింకా రోఁత వుట్టదాయఁగా
చేపట్టి కాచేయట్టి శ్రీవెంకటనాథుఁడె
దాపై వున్నాఁ డిదె దరిసించ రాదా

చి.ఆ.రేకు: 0006-02 గౌళ సం: 10-032

పల్లవి: చిన్నవాఁడు నాలుగుచేతులతో నున్నాఁడు
కన్నప్పుడె శంఖముఁ జక్రముఁ జేత నున్నది

చ. 1: నడురేయి రోహిణినక్షత్రమునఁ బుట్టె
వడిఁ గృష్ణుఁడిదివో దేవతలందు
పడిన మీబాధ లెల్ల ప్రజలాల యిప్పుడిట్టె
విడుగరాయ మీరు వెరవకుఁ డిఁకను

చ. 2: పుట్టుతానె బాలుఁడు అబ్బురమైన మాఁటలెల్ల
అట్టె వసుదేవుని కాన తిచ్చెను
వట్టిజా లింకేల దేవతలాల మునులాల
వెట్టివేములు మానెను వెరవకుఁ డిఁకను

చ. 3: శ్రీవెంకటనాథుఁడె యాసిసువు దా నైనాఁడు
యీవల వరము లెల్లా నిచ్చుచును
కావఁగ దిక్కైనాఁ డిక్కడనె వోదాసులాల
వేవేగ వేడుకతోడ వెరవకుఁ డిఁకను

చి.ఆ.రేకు: 0006-03 సాళంగనాట సం: 10-033

పల్లవి: ఈలగద్ద మూకఁలోన యించుకకోడిపిల్లకు
మూలమూలలఁ దలారికములు చెల్లునా

చ. 1: మంచుకుఁ బెట్టినయట్టి మైనపుఁగుళ్లాయలు
అంచెల లవుడి పెట్టు లానఁ బోయీనా
పంచేంద్రియము లెల్ల బలవంతములై వుండఁగా
యించుక నావైరాగ్య మేడ కెక్కీని

చ. 2: గుగ్గిళ్లు వెలవెట్టి కొనిన గుఱము లెల్ల
దగ్గరి యగడుతలు దాఁటఁబోయీనా
నిగ్గుల బాదకుఁ గాక నేరిచిన సుద్దులెల్లా
వెగ్గళమై యింతటను వెలవెట్టీనా

చ. 3: పోరుకుఁ జాలక పోయి పొడిచే పోటు లెల్లా
నారటిలుఁ గాక అవి నాటఁ బోయినా
గారవాన శ్రీవెంకటనాథుఁడు గావఁగా
భారములు భయములుఁ బాసె నింతె కాకా

చి.ఆ.రేకు: 0006-04 దేసాళం సం: 10-034

పల్లవి: ఏలికెవై నన్నొకని నేలఁగాను నీ
లీలావిభూతి కొకలేశము దక్కువా

చ. 1: పనివూని నాయొకనిపాపము మానుపఁగా నీ
ఘనసంకల్పమునకుఁ గడమా
చెనకి నేనె పూజ సేయఁగా మెచ్చేనంటె
కనుకొనే వందేమి కండ గట్టుకొంటివో

చ. 2: దేవుఁడవై నామనసు దెరిచి రక్షించఁగాను
గోవింద నీమాయ కేమి గొఱతా
సోవల నాలోని భక్తి చూచి కాచే నంటివా
కావలసి నీ వెంత గాదెఁ బోసుకొంటివో

చ. 3: అలరి నాహృదయమునందుఁ గానుపించితేను
వెలయ నీమహిమకు వెలితా
కలిమితో నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
యిలమీఁద నీకు నిప్పు డెంతకీర్తి గూడెనో

చి.ఆ.రేకు: 0006-05 లలిత సం: 10-035

పల్లవి: తచ్చిచూచితేఁ జాలు దైవమే కలఁడుగాక
హెచ్చినమాయలఁ బడ నేల మాకు నిఁకను

చ. 1: సారె సారె నే నెంతసంపదలు గోరినాను
పోరచి నీదేహమెకా భోగించేది
యీరీతి మనసు దా నెన్నటికిఁ దనిసీని
గారవాన హరి నిన్నుఁ గన్నదె దక్కెను

చ. 2: పలుమారు చావులేనిబదుకు కాసపడేది
యిలలోసంసారమెకా యేఁ జేసేది
కలిగినయాస యేకాలమున ముదుసును
అలరి విష్ణునిశర ణన్నదె నిలిచె

చ. 3: వేడుకతో ఘనమైనవిద్యలు నేరిచినాను
జోడుగా నిందరికిని చూపు టింతేకా
వీడని తలఁపుతో శ్రీవెంకటనాథునిఁ గొల్చి
యీడేరి బదుకుటె యెన్ని కింతె కాకా

చి.ఆ.రేకు: 0006-06 లలిత సం: 10-036

పల్లవి: భారము నీదిగాన పట్టి విన్నవించేఁ గాక
ఆరితేరి బుద్దెరిఁగే దది యెన్నఁడయ్యా

చ. 1: వీలనిసంసారపువెట్టి నేఁ జేయఁగాను
యేలిన నిన్నుఁ గొలిచే దెన్నఁడయ్యా
కాలమెల్లా విషయాల గాడినె కట్టుండఁగాను
ఆలించి నీసేవ సేసే దది యెన్నఁడయ్యా

చ. 2: బట్టబయలు మాయలబారిఁ బడివుండగాను
యిట్టె నిన్నుఁ దలఁచే దెన్నఁడయ్యా
పుట్టిపడేకోరికల వువ్విళ్లూరఁగాను
అట్టె నిన్నుఁ బొగడే దది యెన్నఁడయ్యా

చ. 3: సొలసి నాలుక నూరసుద్దులె తడవఁగాను
యిలపై నిన్ను నుతించే దెన్నఁడయ్యా
కలిగి నన్నును శ్రీవెంకటనాథ కాచితివి
ఫలియించెఁ దపము యీబాగు లెన్నఁడయ్యా

 చి.ఆ.రేకు: 0007-01 సాళంగనాట సం: 10-037

పల్లవి: తన దాసునికొరకు ధరియించె నీరూపము
దిన దిన వేడుకఁ గదిరి నారసింహుఁడు

చ. 1: బలురక్కసు నొడిసిపట్టి తొడలపైఁ బెట్టి
చెలఁగి కొనగోళ్లఁ జించినాఁడు
చలపట్టి పేగులజంధ్యాలతోడుతను
తెలివై వున్నాఁడు కదిరి నారసింహుఁడు

చ. 2: ఘెరదానవు కంఠకుహర రక్తము ముంచి
సారెకు వసంతముగాఁ జల్లినాఁడు
మారుకొన్నదైత్యుని చర్మ మొలిచి మేనిమీఁద
ధీరతఁ గప్పినాఁడు కదిరి నారసింహుఁడు

చ. 3: అందపులక్ష్మియు బ్రహ్లాదుఁడు నుతింపఁగాను
విందుగా నాగముపాల వెలసినాఁడు
అంది శ్రీవెంకటనాథుఁడై యీడా నాడాను
దిందుపడున్నాఁడు కదిరి నారసింహుఁడు

ఛి.ఆ.రేకు: 0007-02 సామంతం సం: 10-038

పల్లవి: దవ్వులతెరువు మరేఁటికి తడఁబాటులు మరి యేటిఁకి
యెవ్వరు దలఁచిన నిదియె యీపరముల నొసఁగున్

చ. 1: మన సనియెడు పెనువింటను మాయాలక్ష్యముపైని
పనివడి జ్ఞాన బనియెడి బాణం బేసినను
వెనకటి దుష్కర్మంబులు వేళ్లతోడఁ బెకలిన
తనయకతనె సకలంబును తప్పక కాన నగు

చ. 2: మలయుచు మంత్రార్థం బను మందరగిరిచేతను
చలమున సంసారం బను జలనిధి దచ్చినను
అలవడ హరిభక్తి యనెడి యమృతము వొడమినను
పొలసెటి చావునుఁ బుట్టుగు పొడమక బదుక నగున్

చ. 3: జీవుఁ డనియెడిపాదున చిరకాలంబును మొలచిన
శ్రీవెంకటనాథుండును సిద్ధౌషధతరువు
భావింపఁగఁ దనకృపయను పండూ వండినను
కావలసిన యర్థము దనకైవస మగుఁ గానా

చి.ఆ.రేకు: 0007-03 లలిత సం: 10-039

పల్లవి: తాళపాకన్నమాచార్య దైవమవు నీవు మాకు
వేళమె శ్రీహరిఁ గనేవెర వానతిచ్చితివి

చ. 1: గురుఁడవు నీవెసుమ్మీ కుమతి నై ననాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితి
పరమబంధుఁడ వైనా పరికింప నీవెసుమ్మీ
వరుస నేఁ జెడకుండ వహించుకొంటివి

చ. 2: తల్లివైన నీవెసుమ్మీ తగిన విషయాలలో
పల్లదానఁ బడకుండా బ్రదికించితి
అల్లుకొని తోడునీడవైనా నీవెసుమ్మీ
చిల్లరమాయలలోనఁ జెడకుండాఁ జేసితి

చ. 3: దాతవు నీవెసుమ్మీ తగు శ్రీవెంకటనాథు
నాతలఁపులో నిలిపి నమ్మఁ జేసితి
యేతలఁ జూచినా నాకు నేడుగడయు నీవె
ఆతల నీతల నన్ను నాడుకొని కాచితి

చి.ఆ.రేకు: 0007-04 ఆహిరినాట సం: 10-040

పల్లవి: ఇందురు నేల దూరేరు హితవే నీవు సేయఁగా
ముందు ముందె తమ్ముఁ గర్మములు సేయు మంటివా

చ. 1: తెలిసి నిన్నుఁ గొలువ దేహ మిచ్చితివి గాక
బలిమినె మాయలలోఁ బడు మంటివా
మలసి నిన్నుఁ దలఁచ మన సిచ్చితివి గాక
కొలగట్టి విషయాలఁ గోరు మంటివా

చ. 2: నగుతా నిన్నుఁ బొగడ నాలు కిచ్చితివి గాక
అగడుగా నూరమాఁట లాడు మంటివా
సొగసి నిన్నుఁ జూడఁగాఁ జూప లిచ్చితివి గాక
వగవగలతో నూరివారిఁ జూడు మంటివా

చ. 3: శ్రీవెంకటనాథ నిన్నుఁ జేరు మ నంటివి గాక
జీవులను మనుజులాఁ జేరు మంటివా
భావించి నీదాసులనె భజించు మంటివి గాక
దావతి లంపటాలలోఁ దడఁబడు మంటివా

చి.ఆ.రేకు: 0007-05 నాట సం: 10-041

పల్లవి: ఎన్నిచేఁత లెన్నిగుణా లెన్నిభావాలు
యిన్నేసి నీమహిమ లివి నీకె తెలుసు

చ. 1: యేమిలీలలు నటించే వేమయ్యా దేవుఁడా
భూమిలో జీవుల నెల్లఁ బుట్టింపుచు
ప్రేమతో నాటలాడేపిన్న వాఁడవూఁ గావు
నీమహిమ లిన్నియూ నీకె తెలుసు

చ. 2: యెంతని పరఁదుకొనే విందిరానాథుఁడా
అంతరంగములనుండె అందరిలోన
వింతలు లేవు నీకు వెఱ్ఱివాఁడవూఁ గావు
యింతేసి విచారాలు యివి నీకె తెలుసు

చ. 3: చెలఁగి వరాలిచ్చేవు శ్రీవెంకటనాథుఁడా
తలఁకక నిన్నుఁ గొల్చే దాసులకు
అలరి నీవై తేను ఆశకుండవూఁ గావు
నెలవైన నీసుద్దులు నీకె తెలుసు

ఛి.ఆ.రేకు: 0007-06 రామక్రియ సం: 10-042

పల్లవి: మాయలో మునుఁగ నేల మమత లేల
చేయరా దేవుఁ డీపాటి సేయ నోపఁడా

చ. 1: అట్టె దేహసమ్మంధ మాసపడేజీవులాల
పట్టి హరిసమ్మంధాన బ్రదుకరాదా
నెట్టన సర్వాంతరాత్మై నిలుచున్న దేవుఁడిట్టె
చుట్టాలపక్కాలపాటి శుభ మియ్య నోపఁడా

చ. 2: మోసపోక ధనధాన్యములు గూర్చే దేహులాల
వేసరక విష్ణుభక్తి వెదకరాదా
రాసి కెక్క యిందరిని రక్షించేదేవుఁడె
కాసువీసములపాటి కావ నోపఁడా

చ. 3: వెలయ రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీవెంకటనాథుఁ గానఁగ రాదా
వలె నని యిందరికి వరాలిచ్చే దేవుఁ డేమి
కొలువునిలువుపాటిగుణ మియ్య నోపఁడా

చి.ఆ.రేకు: 0008-01 దేసాళం సం: 10-043

పల్లవి: వట్టి విచారములేల వగపులేల
నెట్టన శ్రీహరిఁ జేర నేరవలెఁగాక

చ. 1: కాల మేమి సేసీని కర్మ మేమి సేసీని
యేలిన శ్రీరమణుఁడె యెదనుండఁగా
ఆలించిన ధ్రువునిని అజామిళునిని
కాల మేమిసేసె నయ్యా కర్మ మేమిసేసెను

చ. 2: పాప మేమి సేసీని పగ యేమి వేసీని
కాపాడె దేవుఁడె దగ్గరనుండఁగా
యేపున ఘంటాకర్ణుని యెలమిఁ బ్రహ్లాదుని
పాప మేమి సేసెనయ్యా పగయేమి సేసెను

చ. 3: కుల మేమి సేసీని గుణ మేమి సేసీని
నలువైన శ్రీవెంకటనాథుఁ డుండఁగా
ఆలరి వాల్మీకికి అలనాఁ డహల్యకు
కుల మేమి సేసెనయ్యా గుణ మేమిసేసెను

చి.ఆ.రేకు: 0008-02 లలిత సం: 10-044

పల్లవి: అందరు వికార మందుదురె
నిందలేని నీవు నీదాసులుదక్క

చ. 1: సతుల సుతులఁ జూచి జగములోవారెల్లా
మతిలోన భ్రమయక మానరు
రతికెక్కఁగా హేయరాగరహితుఁడవై
సతతము గలిగినస్వామివి నీవు దక్క

చ. 2: ధనధాన్యములుచూచి తగినజీవులు వాని
వెనువెంటఁ దిరుగక విడువరు
పనివూని యాశాపాశ దూరుఁడవై
ఘనతగలుగు శ్రీకాంతుఁడ నీవుదక్క

చ. 3: యిల్లుముంగిలిచూచి యీదేహులు వాని
నొల్ల మనుచురోసి వుడుగరు
వెల్లవిరిగ శ్రీవెంకటనాథుఁడవై
తెల్లమైనయట్టి దేవుఁడవుదక్క

 చి.ఆ.రేకు: 0008-03 సాళంగనాట సం: 10-045

పల్లవి: ఎటులఁబుట్టించితో నీవెరుఁగుదువు
ఘటన నన్నియు నీసంకల్ప మేఅయ్యా

చ. 1: చచ్చేవారిఁజూచి చావుకు వెరతుగాఁన
రొచ్చులసంసారముప రోతుఁగాని
కచ్చుపెట్టి ఆదియె కాలాఁజేతాఁబెనఁగఁగ
మచ్చికసేయుదుఁగాని మానలేనయ్యా

చ. 2: బడలేవారిఁ జూచి బడల నోపఁగాన
విడువనిసంపదపై విసిగేఁగాని
పెడవాయ కదియె పెరుగుచురాఁగాను
బడిఁ దిరుగుదుఁగాని పాయలేనయ్యా

చ. 3: ములిగేవారిఁ జూచి ములుగ నోడుదుఁగాన
శిలుగుఁగోరికలఁ గోసితిఁ గాని
కలిమితో శ్రీవెంకటనాథ నీభక్తి
వెలయఁ గోరుదుఁగాని విడువలేనయ్యా

చి.ఆ.రేకు: 0008-04 రామక్రియ సం: 10-046

పల్లవి: నీవుగలిగినఁ జాలు నిక్కము అన్నీఁ గలవు
ఆవల మాయాచార్యుఁ డానతిచ్చెనయ్యా

చ. 1: యేలోకముననున్న యెడయనిసొమ్ము నీవె
తాలిమి యెందుఁ బోనిధనము నీవె
కాలముకడాతరగని ధాన్యము నీవని
ఆలించి మాగురుఁ డిట్టె ఆనతిచ్చెనయ్యా

చ. 2: యెందెందుం దిరిగిన యేలికవు నీవె
నిందలేనియట్టి తోడునీడవు నీవె
ముందువెనకల నిల్లు ముంగిలియు నీవె యని
అందముగ దేశికుఁడె ఆనతిచ్చెనయ్యా

చ. 3: యెన్నఁడుఁ గలఁగనట్టి హితుఁడవు నీవె
పన్నినట్టెవుండె నిచ్చపంటా నీవె
నన్నుఁ గాచే శ్రీవెంకటనాథుఁడ వని తాళ్లపా
కన్నమయ్యంగారె నాకు నానతిచ్చిరయ్యా

చి.ఆ.రేకు: 0008-05 లలిత సం: 10-047

పల్లవి: జగదీశ్వరుని లీలాచక్రములోపలనుండి
మగుడ దాసుఁడుగాక మాయ దాఁట వసమా

చ. 1: తనువు నాదెయనఁగ తనకు స్వతంత్రమేది
తనువులో తాను హరి తను వెకాన
మనసులో యీసుద్ది మరినమ్మితేఁ జాలు
వెనకముందరలకు విచారమేలేదు

చ. 2: సొమ్ములు నావియనఁగ సోధించఁ దానెవ్వఁడు
సొమ్ములునుఁ దాను హరిసొమ్ము లెకాన
సమ్మతి నీతలఁపె సహజమై కలిగితే
నెమ్మదిఁ దా నిన్నిటా నిశ్చింతుఁడౌను

చ. 3: బంటులు నావారనఁగఁ బరికించ నెవ్వఁడు
బంటులును దాను హరిబంట్లెకాన
నంటున శ్రీవెంకటనాథునిఁ గొలిచితేను
కంటకములెల్లాఁ బాసి ఘనుఁడె తానౌను

చి.ఆ.రేకు: 0008-06 శుద్ధవసంతం సం: 10-048

పల్లవి: మేలేమి కీడేమి మించిన నీరూపమె
వాలాయించి తెలిసినవానికి

చ. 1: యినుమేమి పసిఁడేమి యెంచిచూచితె
మనసు దెలిసిన నిర్మలునికి
ఘనమేమి కిరుదేమి కలవెల్లా నీ
తనువుగఁ దెలిసిన తత్వజ్ఞానికి

చ. 2: పగయేమి చెలిమేమి పలుమారు నిన్ను
పొగడుచునుండెటి పుణ్యునికి
వగుపేమి వేడుకేమి వరుసతో నిన్ను
వెగటులేక కొలిచే వివేకికి

చ. 3: చేరువేమి దవ్వేమి శ్రీవెంకటనాథ నిన్ను
కూరిమిఁ గొలిచిన సద్గుణునికి
బారమేమి పాటేమి పరమాత్మా నిన్ను
సారమతిఁ దెలిసిన సర్వజ్ఞునికిని

 చి.ఆ.రేకు: 0009-01 లలిత సం: 10-049

పల్లవి: ఏలికయైన హరి నేల మరవఁగవలె
పాలుమాలి మరియాల భంగపడవలెను

చ. 1: యిరుకుమానిసంది నేఁటికిఁ జొరవలె
తిరుగలేక యేల తినుకవలె
యెరవులవిషయాల నేల పారలవలె
కొరగాని పాపాలగొడ వేలవలెను

చ. 2: మిగుల పురులలోన మెడ యాల పెట్టవలె
తగిలించుకొని యేల పొగులవలె
యెగసక్కెపుఁగోరిక లేల కోరవలె
జిగురువంటిబందాలఁ జిక్క నేలవలెను

చ. 3: పారేబండికింద పాద మేల చాఁచవలె
జారుపడి మరియాల జడియవలె
మీరి శ్రీవెంకటనాథు మిక్కిలివేడుకఁ గొల్చి
పోరుమాలివుండ కేల పొడిఁబడవలెను

చి.ఆ.రేకు: 0009-02 పాడి సం: 10-050

పల్లవి: తానేడ వారేడ తనువేడ మరి తక్కినవెల్లానేడ
మానలే ననుచు తరితీపు సేసే మన సేడ నుండునో

చ. 1: కందువమానిపై నోరూరించెటికాయలుఁ బండ్లుపక్వముదప్పిన
అందముగ మున్ను గోరినట్టివారి యాసలెందుండునో
పొందున వలచి పులకించినట్టిపురుషులు సతులట్టెముదిసితె
ముందర వెనక నెరఁగనియ్యనిమోహ మెందుండునో

చ. 2: కొత్తమెరుఁగులచేత భ్రమయించే కోకలు చివిరె పాఁతగిలితె
బత్తితోఁ గావలె నని కొన్నవారిభ్రమ లెందుండునో
రిత్తజవ్వనాన కొప్పుగోళ్ల దిద్ది రీతిగానుండెటి సింగారంబులు
పత్తివలెనై బట్టగట్టఁదనభావ మెందుండునో

చ. 3: తావితో బుగులుకొనెటివూవులు దాఁపఁగ నవియె వాడినపిమ్మట
భావించి చూచితే నందలి తొల్లిటిపస యెందుండునో
శ్రీవెంకటనాథుఁ డిట్టె యేలెఁగాకచెల్లఁ బోతాఁదొల్లి భోగించినవెల్ల
వేవేగ మరునాఁ డవియె చూడ నేవిధమైయుండునో

చి.ఆ.రేకు: 0009-03 మాళవిగౌళ సం: 10-051

పల్లవి: శ్రీపతిపురనాయకా జయచింతితాభీష్టదాయకా

చ. 1: వున్నతోన్నతవిగ్రహ దాసోపరిస్థానుగ్రహా
నన్ను తామరగసుగ్రహా సామవదపరిగ్రహా

చ. 2: జానకీప్రియకారకా శివసాధితాఖిలతారకా
మానుషాహితమారకా మామకాఘనివారకా

చ. 3: శ్రీవెంకటనాథరూపకా సంచితరఘుకులదీపకా
భావసంతోషప్రాపకా అభంగమంజులచాపకా

చి.ఆ.రేకు: 0009-04 దేసాళం సం: 10-052

పల్లవి: ఎట్టిహితోపదేశకుఁ డెటువంటిదయాళువు
అట్టె తాళ్లపాకన్నమాచార్యులు

చ. 1: పచ్చితామసుల మమ్ముఁ బరమసాత్వికులఁగా
యిచ్చటనె సేసినాఁడు యెంతచిత్తము
యిచ్చగించి మాకులాన నెన్నఁడులేనివైష్ణవ
మచ్చముగాఁ గృపసేసె నన్నమాచార్యుఁడు

చ. 2: ముదిరిన పాపకర్మములు సేసినట్టి మమ్ము
యెదుటఁ బుణ్యులఁ జేసె నెంతసోద్యము
కదిసి యేజన్మానఁ గాననిసంకీర్తన
మదన నుపదేశించె నన్నమాచార్యుడు

చ. 3: గడుసుఁదనపు మమ్ముఁ గడు వివేకులఁ జేసి
యిడుమలెల్లాఁ బాప నేమరుదు
నడుమనె యెన్నఁడుఁ గానని శ్రీవెంకటనాథు
నడియాలముగ నిచ్చె నన్నమాచార్యుఁడు

చి.ఆ.రేకు: 0009-05 సామంతం సం: 10-053

పల్లవి: తోఁటకూరదొంగలాల తొయ్యలులాల
నాఁటకపు మీమోహము నమ్మ నెట్టువచ్చును

చ. 1: పాపపుణ్యపు టోఁదాలపాలు సేసి జీవులను
చూపలనె భ్రమయించే సుద్దులు మీవి
దాపుదండై శ్రీవిభుఁడు తానె కాచెఁగాక
యేపున రిత్తవారి మీ రెంతంత సేయరు

చ. 2: కీడు మే లనె పురులఁ గీలించి మనుజులఁ
బాడితోనె యెంచెటిభావము మీది
యీడేరించి నాగురుఁడు యిందిరేశుఁ జూపెఁగాక
యీడనె రుత్తవారి మీ రెంతంతసేయరు

చ. 3: చావుఁ బుట్టుగు లనెటి సముద్రాలఁ బడఁదోసి
జీవులను విసిగించేచిత్తము మీకు
శ్రీవెంకటనాథుఁడె చేపట్టి మమ్మేలెఁగాక
వేవేగనఁ బేదలచే వెట్టి యెంతగొనరు

 చి.ఆ.రేకు: 0009-06 మాళవి సం: 10-054

పల్లవి: నూరవద్దు తాగవద్దు నోరు చేఁదుగావద్దు
చేరువ నొకచోట సంజీవి వున్న దిదివో

చ. 1: పొలమెల్లాఁ దిరిగాడి పొడిఁబడనెవద్దు
తలఁకక గడ్డపారఁ దవ్వవద్దు
వలవని వాఁగుల వంకల వెదకవద్దు
చెలఁగి వొకచోటసంజీవి వున్న దిదివో

చ. 2: మొక్కలానఁ జెరువులో మునిఁగి చూడవద్దు
నిక్కిన పుట్టలమీఁద నెమకవద్దు
వెక్కసానఁ జేతిపైఁడి వెలవెట్టి కొనవద్దు
చిక్కులెల్లా బాపెటిసంజీవి వున్న దిదివో

చ. 3: దీవులను నోడలెక్కి తిరుగాడనేవద్దు
సోవల బిలములోనఁ జొరవద్దు
కావించి గ్రహణాదికాలము వెదకవద్దు
శ్రీవెంకటనాథుడైసంజీవి వున్న దిదివో

చి.ఆ.రేకు: 0010-01 దేసాళం సం: 10-055

పల్లవి: ఎఱుక గలిగితేను యీతఁడె దిక్కు
మఱి నిమిష మీతని మానివుండఁదగునా

చ. 1: యెవ్వరిసొమ్ముగుడిచి యెవ్వరిగుఱ్ఱాలవెంట
కొవ్వుదీరఁ బారాడి కొలిచేది
యివ్వలఁ బుట్టించి పెంచి యేలిన దేవుఁ డుండఁగా
ఆవ్వ లివ్వలివారిని ఆసపడఁ దగునా

చ. 2: తా నెవ్వరికి బుట్టి తలఁకక వూరివారి
నానందాన అయ్య లమ్మ లనుకొనేది
పానిపట్టి సర్వవిధబంధుఁడు విష్ణుఁడుండఁగా
మానిసిచుట్టరికాలు మరుగగ జెల్లునా

చ. 3: యెందువంకనో యీదేహి యేమిటినో పొగడుచు
విందువలె నెవ్వరిని వెట్టిఁజేసేది
కందువైన శ్రీవెంకటనాథుఁడు గావఁగా
సందుసుడి కోరికల సటఁ బడఁ జెల్లునా

చి.ఆ.రేకు: 0010-02 నాట సం: 10-056

పల్లవి: ఇందరి జూచి చూచి యెఱఁగవద్దా
బందెపసులకు మెడ పన్నించ నేలా

చ. 1: యినుమునఁ జేసిరా యెవ్వరిదేహమైనా
పానిఁగి పోతేఁబోవు పోకుంటే మాను
పనివడి యిందుకుఁగా బాటువడ నేమిటికి
మొనసి దొసపంటికి యినుప కట్టేలా

చ. 2: మంచి రాతఁ జేసిరా మనుజునిమే నేమి
నించి చెడితేఁ జెడు నిల్చితే నిల్చు
పొంచి పొంచి యిందుకుఁగా పొడిఁబడ నేఁటికి
పంచ నీరుబుగ్గ రాతిబరణిఁ బెట్ట నేలా

చ. 3: చేఁగమానఁ జేసిరా చెల్లఁబో నరుల నెల్లా
యీఁగి కుంగితేఁగుంగు హెచ్చితే హెచ్చు
నాఁగువార శ్రీవెంకటనాథుఁడు మన్నించఁగాను
దాఁగి జీలుగుబెండుకు తరమువెట్ట నేలా

చి.ఆ.రేకు: 0010-03 భూపాళం సం: 10-057

పల్లవి: గోవిందా మేల్కొనవయ్యా
కావించి భోగము కడమా నీకు

చ. 1: కమలజ చల్లనికాఁగిటఁ దగిలి
సమరతి బాయఁగఁ జాలవూ
కమలభవాదులు కడు నుతియింపఁగ
విమలపుశయనము విడువగ లేవు

చ. 2: భూసతితోడుత పొందులు మరిగి
వేసర విదె నీవేడుకలా
వాసవముఖ్యులు వాకిట నుండఁగ
పాసి వుండ నని పవళించేవూ

చ. 3: నీళామనసిజలీలలఁ దగిలి
నాలితోడ మానఁగ లేవూ
వేళాయను శ్రీవెంకటనాథుఁడ
పాలించి దాసుల బ్రతికించఁగనూ

చి.ఆ.రేకు: 0010-04 లలిత సం: 10-058

పల్లవి: సకలపురాణములు చాటి నినుఁ బొగడఁగా
తకమకలుగా నల్పార్థము చెప్పఁదగునా

చ. 1: నిను నిర్గుణు డనేటి నీచజాతులయందు
యెనయు దుర్గుణము దా నెంతో
కనకంబు నిను మనుచు కారునాయంబులను
యెనలేనిదుర్వాదుల నేమనఁగఁగలము

చ. 2: నీవె తా మనుకొనేటి నిందితాత్ములు దాము
కావించుద్రోహంబు కడమా
దావతులఁ దనుఁగన్నతల్లి గొడ్డనిపల్కు
దేవతానిందకులఁ దెలుపంగ వశమా

చ. 3: అమరుసర్గము మిథ్య యనుశూన్యభాషులకు
తమితోడ భ్రమ యేల తరగు
తమగురువు శాస్త్రంబు తామె కల్లనఁ గాను
క్రమబుద్ధి శ్రీవెంకటనాథ యిత్తువా

చి.ఆ.రేకు: 0010-05 దేవగాంధారి సం: 10-059

పల్లవి: నిమిష మెడతెగక హరి నిన్ను దలచి
మమత నీమీఁదనే మరిపి బదుకుట గాక

చ. 1: నిదురచేఁ గొన్నాళ్లు నేరములఁ గొన్నాళ్లు
ముదిమిచేఁ గొన్నాళ్లు మోసపోయి
కదిసి కోరినను గతకాలంబు వచ్చునె
మది మదినె వుండి యేమరక బదుకుట గాక

చ. 2: కడుఁ దనయులకు గొంత కాంతలకు నొకకొంత
వెడలయాసలకుఁ గొంత వెట్టిసేసి
అడరి కావలె ననిన నందు సుఖ మున్నదా
చెడక నీసేవలే సేసి బదుకుట గాక

చ. 3: ధనమువెంటాఁ దగిలి ధాన్యంబునకు దగిలి
తనవారిఁ దగిలి కాతరుఁ డైనను
కనుకలిగి శ్రీవెంకటనాథ కాతువె
కొనసాగి నిన్ననే కొలిచి బదుకుట గాక

చి.ఆ.రేకు: 0010-06 వరాళి సం: 10-060

పల్లవి: గాడిదెపిల్ల కోమలికమె కలిగినది
వేడుక పడు సంసారమె విసిగించు వెనక

చ. 1: అగపడు సంపదమీదట నాసలు కడుఁ బుట్టు
వగ నది భరియింప వసమె కాదయ్య
మొగమె చూడఁగ నాపై ముదమునఁ గనుపట్టు
పొగులఁగ గరచెటికాట్లు పులికంటె బెట్టు

చ. 2: విడువని భోగంబులపై వేడుక కడుఁ బుట్టు
తడఁబడులంపట మైతే తలఁచనె రాదయ్య
తొడి మెను మాగినపండైతే తోఁచుఁ జూచినను
వడియఁబడి గొడ్డంటికి వసమె కాదెవుడు

చ. 3: మోవఁగ విషయంబులపై మోహము కడుఁ బుట్టు
శ్రీవెంకటనాథా అది చెప్పఁగ రాదయ్య
ఆవలఁజూడఁగఁ జల్లనై వుండుఁ గాని
తేవలఁ గూఁకటవేళ్లు తెగఁ బారును మిగులా

చి.శృం.రేకు: 01-1 వరాళి సం: 10-1

పల్లవి: ఎట్టకేల కిదేలరా యెన్నఁడులే నలవాటు
చిట్టకాల కిన్నా ళ్లిట్టె సేయవత్తువా

చ. 1: దవ్వుల నాటఁ జూచేవు దగ్గరి మాఁటలాడేవు
యెవ్వతైనా మతకాన కీడ కంపెనో
యివ్వల నిన్నాళ్లు మనమిద్దరము నొక్కవూరె
నవ్వులు మాతో నిట్టె నవ్వవత్తునా

చ. 2: వొరసేవు రమ్మనేవు వోరి ముచ్చట లాడేవు
గరిమ రేతిరి కలగంటివా నీవు
యిరవుగ నేను నీవూ నిద్దరము నొక్కవూరె
నెరతనా లిట్లానె నెరపుదునా

చ. 3: యిక్కువ నాతోఁజెప్పేవు యిప్పుడిట్టె రమ్మనేవు
యెక్కువ నామనసు నీవెఱుఁగుదువా
చక్క శ్రీవెంకటనాథ సరవి నన్నుఁ గూడితి
మక్కువ వెనక కిట్టె మన్నింతువా

చి.శృం.రేకు: 01-2 మధ్యమావతి సం: 10-2

పల్లవి: విన్నవించవే వోరమణి విభునికి వింత లింకనేలె
వున్నతిఁ దన్ను నే నేమైన నంటినా వోరుచుకొమ్మనవే

చ. 1: చెలులలో నన్నె చేపట్టినవాఁ డలుగనేఁ టికినే
వలచి తానాకు నిచ్చినబాసలు వాకిటనె పోయనా
తలఁచి తలఁచి తాపాన నే నిట్టె తలఁకుచు నుండఁగా
కలయఁ దా రాక యెడమాఁటలనె కాఁకరేఁచ నేలె

చ. 2: యెప్పుడు నావద్దఁ బాయనివాడు నేఁ డేమిటికిఁ బోయనే
తప్పెనో నామీఁది మోహము తనకు తామసించ నేలె
ముప్పిరిగొన్నట్టి జవ్వనము నే మోవలేకవుండఁగా
యిప్పుడెవిచ్చేసి నన్నుఁ గలయక యేమిటికున్నాఁడె

చ. 3: యెక్కుడుమాఁట దన్నాడని నాతోడనేఁటికిఁ గోపించెనే
వొక్కటై నే నెంతమీరి నవ్వినా నూరకుండేవాఁడు
చక్కని శ్రీవెంకటనాథుఁడు నన్ను సరవితోఁ గూడెనే
మక్కువ న న్నింక దిగవిడువక మన్నించు మనవె

ఛి.శృం.రేకు: 01-3 సామంతం సం: 10-3

పల్లవి: అవునె లెస్సతగవులాయనె నేఁడు
తివిరి నీకింత నాతో దీకొనఁగవలెనా

చ. 1: మాఁటఁల దేలించనేర్చుమగువా నీకు నిప్పుడు
యేఁటికె నా విభునితో నేకాంతము
వాఁటమై నాపతిపొందు వద్దన్నా మానవు
గాఁటాన నీకింతయేలె గామిడితనాలు

చ. 2: కూరిమిపుట్టించనేర్చుకోమలి యేఁటికే నీకు
చేరి నారమణునితోఁ జేసన్నలు
సారెకు నామగనితో సరసాలు మానవు
కారణములేని దేలె గయ్యాళితనాలు

చ. 3: కలసి మెప్పించనేర్చుకామిని యేఁటికె నీకు
నెలవై నాకాంతునితో నెయ్యములు
యిల శ్రీవెంకటనాథుఁ డిద్దరి మన్నించికూడె
మలసి మనలో నిఁక మచ్చరా లేమిటికె

చి.శృం.రేకు: 01-4 పాడి సం: 10-4

పల్లవి: మానరా నారో నింక మరఁగులు
పోనీనెంతైనా నిన్ను బొంకకు నాతోను

చ. 1: గుఱుతైన యాకెమేనికుంకుమపరిమళము
మెఱయ నేఁటికిరా నీమేనియందును
మెఱుఁగు నీమేనిమీఁద మించిని కెంపేలవచ్చె
పొఱపొచ్చముల నీవు బొంకకు నాతోను

చ. 2: లలనపాదానను్న లత్తుక నీనొసలను
కలుగ నేమిటికి వేగనచెప్పరా
కలికిపుక్కిటనున్న కప్పురపుఁ దమ్ములము
పొలుపై నీకేలవచ్చె బొంకకు నాతోను

చ. 3: పడఁతి నీమేన నిట్టె బాగుగానించినయట్టి
జడిగొన్న కొనగోళ్లజాడ లేదవి
కడఁగి నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
పొడవైనచెలిసుద్ది బొంకకు నాతోను

చి.శృం.రేకు: 01-5 పాడి సం: 10-5

పల్లవి: మేలురా యీనీగుణము మెచ్చవచ్చును
పోలించ నీచేత పూఁట పూఁట కొత్తేకాదా

చ. 1: దిట్టయై యెవ్వతెయైనాఁ దిట్టినా నవ్వేటి నీవు
యెట్టు నేఁ బొగడినాను యీరసించేవు
యిట్టె వలపించేవా రేమ్ననినా జెల్లుఁగాక
నెట్టన నేనూరకున్నా నీకు నెగ్గేకాదా

చ. 2: తొయ్యలి యెవ్వతెయైనాఁ దోకినా నవ్వేటి నీవు
యియ్యెడ నేమొక్కినాను యేవగించేవు
నెయ్యపువారిచేఁతలె నీకు నితవౌఁగాక
చయ్యన నామోహమైన చప్పనెకాదా

చ. 3: వొదుగ కెవ్వతె గైకోకుండినా నవ్వేటి నీవు
యెదురుకొన్నా నామో మిటుచూడవు
యిదె శ్రీవెంకటనాథ యిట్టె నన్నుఁగూడి నా
మదిలోఁ బాయవైతివి మంచిదెకాదా

చి.శృం.రేకు: 02-1 పాడి సం: 10-6

పల్లవి: ఒద్దన్న జలము సేసీ నోయమ్మ వీఁడు తన
వుద్దండా లెంతైనా మానఁ డోయమ్మ వీఁడు

చ. 1: యేపుమీరి నాతోడ నెగసక్కే లాడీని
వో పో పొమ్మన్న మానఁ డోయమ్మ వీఁడు
పై పై నన్నుఁ జెనకి బలిమి సేయవచ్చీనే
నోపనన్నాఁ గొంగువట్టీ నోయమ్మ వీఁడు

చ. 2: సారెకుఁ బేరఁ బిలిచి సన్నలు సేయవచ్చీని
వూరకపోయెటి నన్ను నోయమ్మ వీఁడు
నేరుపరి నంటానె నిండువావి సేసుకొనీ
నోరిచిన నెరఁగఁడు వోయమ్మ వీఁడు

చ. 3: యేలుకొన్నవానివలె నెవ్వరుంటా నెరఁగఁడు
వోలవేయవచ్చీ నాపై నొయమ్మ వీఁడు
నాలికాఁడు శ్రీవెంకటనాథుఁడు నన్ను విట్టె
వోలివెట్టెకె కూడె నోయమ్మ వీఁడు.

చి.శృం.రేకు: 02-2 శంకరాభరణం సం: 10-7

పల్లవి: చాలుఁ జాలు నే నెరంగనా నాఁడు నాఁడె
ఆలరి నీసుద్దు లెల్ల నన్నీఁ గంటిని

చ. 1: సారె సారె నన్ను నేల పిలిచేవు
యేరా నీ వలపు నే నెరఁగనిదా
వూరకె యింకా నేలరా మాఁటలనె
దూరేవు నీసుద్దు లెల్ల తొల్లె కంటిమి

చ. 2: సన్నలు సేసే సేమిరా యెరఁగనా
చిన్ననాఁడె నీ చేఁత లెల్లాను
చన్నులుముట్టే వేమిరా నాలికాఁడ
వున్నతి నీసుద్దు లెల్లా నిన్ననె కంటిమి

చ. 3: దగ్గరి చేయి పట్టేవురా యెప్పుడును
నిగ్గుల నీ చల మెల్లా నే నెరఁగనా
అగ్గమై శ్రీవెంకటనాథ కడపలో
దగ్గరి నన్నుఁ గూడగా తలఁ పెల్లాఁ గంటిమి

చి.శృం.రేకు: 02-3 శ్రీరాగం సం: 10-8

పల్లవి: ఇంతిచక్కఁదన మిఁక నేమని కొనాడుదమ
చెంత నాతఁడును నీపె చేతలకె భ్రమసె

చ. 1: మొలక నవ్వుల చెలిమోము చూచి విభుఁడు
తొలఁకువెన్నెలల చందురుఁ డని భ్రమసె
మలయు జంకెనల బొమ్మలుచూచి రమణుఁడు
వెలయఁగ మదనుని విండ్లని భ్రమసె

చ. 2: సొగసిన చెలి చూపు చూడ జూచి ప్రియుఁడు
పగతో మరుఁ డేసిన బాణ మని భ్రమసె
మగువ యాడినయట్టి మాఁట విని నాయకుఁడు
పగటునఁ గోవిలపలు కని భ్రమసె

చ. 3: కరఁగించి చెలి దన్ను కాఁగిలించిననుఁ బతి
తిరమైయున్న మెరుఁగుఁ దీగె యని భ్రమసె
గరిమతోడుత శ్రీవెంటనాథుడు కాంత
వరుసఁ గూడఁగ పరవశమున భ్రమసె

చి.శృం.రేకు: 02-4 హిజ్జిజీ సం: 10-9

పల్లవి: నీ వేమి సేతువు నానేరమోయమ్మా
చేవ నీయిచ్చు రాజ్యము సేయవోయమ్మా

చ. 1: వలపించి రమణుని వాకిలి వెళ్లనీవు
కలికిచేఁతలనె కదవమ్మా
చలమున నావిభుని జంకించి నాఁడు నాఁడె
నెలవై నే నింతేసి నేరనైతినమ్మా

చ. 2: నయమున నాపతిని నాయింటికిరాకుండా
బయకారించితివిగా పదవమ్మా
పయిపడి యతనిచే బాసలెల్లఁ జేయించుక
జయముతోడుత నుండఁజాలనై తినమ్మా

చ. 3: నటలకు నామగని జంటవాయక న న్నిట్టె
అటమటించితివిగా అవునమ్మా
నటనతో శ్రీవెంకటనాథుడు మ నిద్దరిని
యిటులనె సరిగా నేలెనోయమ్మా

చి.శృం.రేకు: 02-5 పాడి సం: 10-010

పల్లవి: ఎంత సేసినాను ని న్నేమనేనురా
వింతదాననా యలిగి వెరపుచూపను

చ. 1: యేడనై నా నిలిచి నీ వెవ్వతెతో నైన మాఁట
లాడుకొన్న నిన్ను నే నద్దలింతునా
యీడనుండె నన్ను నీ వెవ్వతెపేరఁ బిలిచినాను
కోడెకాఁడ నిన్ను నిట్టె కోపగింతునా

చ. 2: కలికివైన నిన్ను నేకాంతయింటఁ జూచినాను
చలము సాధించి నిన్ను సాధింతునా
సొలసి నీమేన నెవ్వతె సొమ్ముపెట్టు కుండినాను
కులుకుమాఁటలను నిన్ను గుంపింతునా

చ. 3: వన్నెకాఁడ యేరమణి వాకిలిగాచున్నా నిన్ను
సన్న సేసి సారె సారె జంకింతునా
నన్ను నిట్టె శ్రీవెంకటనాథుఁడ నీవెకూడి నేఁడు
కన్నెనైన నామనంబు కఁరఁగ జేసితి

చి.శృం.రేకు: 02-6 ఆహిరి సం: 10-011

పల్లవి: ఇంతలోనందుకొనే వేమీ నీవు
యెంతసేతువో నీతో నీతో నిట్టె పొందుసేసిన

చ. 1: తేలగిలఁ జూచితేనె తెలిసె నీమన సంటా
తాలిమితోడుత నన్ను దగ్గరేవు
పోలికగా నామేను పులకించినంతలోనె
ఆలిఁ జూచినట్టె చూచే వపునయ్యా నీవు

చ. 2: అలవోకగా నీపే రడిగినయంతలోనె
చెలరేఁగి నీవావి చెప్పేవూ
జలకపుఁ జెమటలు సారె నామైఁ బొడమితె
వలపుచల్లి చొక్కించవచ్చేవు నీవూ

చ. 3: సవరనివాఁడ వంటా జాణతన మాడితేనె
రవళిఁ జెయిముట్టి సరస మాడేవు
నవకపు శ్రీవెంకటనాథ కాఁగిలించితేనె
కవకవనవ్వి రతిఁ గలసితి నీవూ.

చి.శృం.రేకు: 03-1 ముఖారి సం: 10-012

పల్లవి: ఇన్నియు నేమి సేయునె యింపు లిన్నియునుఁగూడి
కన్నెపాయాననె నన్నుఁ గలికి జేయఁగను

చ. 1: మన సేమి సేయునె మచ్చిక యీవలపులు
కొనసాగి లోలోనె గుబ్బతిలఁగా
తను వేమి సేయునె తతిగొన్న తమకము
వెనుకొని పోనీక వీరిడిఁ జేయఁగను

చ. 2: చూపు లేమి సేయునే సుడిగొన్న జవ్వనము
పై పైఁ దీపు లెక్కించి భ్రమయించఁగా
కోప మేమి సేయునె గురియై యీ విరహము
ఆపసోపాలె రేఁచి అలయించఁగాను

చ. 3: పులక లేమి సేయునె పోదియై పతికాఁగిలి
కళలలోని మర్మాలు గలఁచఁగాను
చెలువ మేమి సేయునె శ్రీవెంకటనాథుఁడు
సొలపులరతిఁ గూడి చొక్కించఁగాను

 చి.శృం.రేకు: 03-2 కేదారగౌళ సం: 10-013

పల్లవి: వలపించనేరుతువు వడి నేచనేరుతువు
సిలుగు కోప నీవు నేసినట్టె సేయరా

చ. 1: ప్రియముతోడుత నన్నుఁ బిలిచేవు యీ
నయమె యీడేర నడపేవా
బయకారించే నీచే బడలితిని నీ
చెయి మీఁ దింతె నీవు సేసినట్టె సేయరా

చ. 2: దగ్గరి నాతో మంచితన మాడేవు యీ
నిగ్గుల నీమే లిట్టె నిలిపేవా
వెగ్గళించే నీచేత విసిగితిని నాకు
సెగ్గేము గాదు నీవు సేసినట్టె సేయరా

చ. 3: కలసితి నన్ను శ్రీవెంకటనాథుడా నీ
తలఁపులో దయ నాపైఁ దప్పేనా
యెలయింపు నీచేత నింతైతిని నాపై
చెలిమిగలవు నీవు సేసినట్టె సేయరా

చి.శృం.రేకు: 03-3 కేదారగౌళ సం: 10-014

పల్లవి: చాలు నాతో నింతేసి జంపు లేలా
ఆలరి నీచేఁత లెవ్వరితోనైనఁ జేయరా

చ. 1: రాకాఁ బోకాఁ నాతో నింతేసి రంతు లేలా
నీకు నీకె చుట్టరికములు నెరపేవు
నాకు నీకు నేమి వోదు నన్ను నవ్వుతానె
యేకమైన మాఁటలనె నన్ను యెలయించేవు

చ. 2: సారె సారె నాతో నింతేసి సట లేలా
వూరకె నీవావులు దెలిసి వొరసేవు
తారుకాణమాఁటల నిక్కువ దాఁక నాడి
మేరమీరి యానలు వెట్టుతా మేకొనేవూ

చ. 3: మెచ్చి మెచ్చి నాతో నింతేసి మేకు లేలా
యిచ్చకము సేసి సేసి నన్ను యేలఁ జూచేవు
విచ్చలవిడిఁ గూడితి నన్ను శ్రీవెంకటనాథ
పచ్చిదేర నన్ను నింకా నొడఁబరచేవూ.

చి.శృం.రేకు: 03-4 హిజ్జిజి సం: 10-015

పల్లవి: ఎటువంటివాఁడె యీతఁడు
యిటువలె దగ్గరీ నీతఁడు

చ. 1: తలయెత్తి చూచితే తనుఁ జూచితి నంటా
యెలయించవచ్చీ నీతఁడు
చెలులతోడ నేఁ జేసన్న సేసితే
యెలమి దగ్గరవచ్చీ నీతఁడు

చ. 2: యింతిఁ బిలిచితే యెరపరికము లేక
యింతలోఁ బలికీ నీతఁడు
చెంత నాసకిపైఁ జెయివేయఁబోతే
యెంత కెంత చెయ్యొగ్గీ నీతఁడు

చ. 3: యెదుటనున్నసతితో నేకతము లాడఁబోతే
యిదివో కాఁగిలించీ నీతఁడు
కదిసి యిప్పుడు శ్రీవెంకటనాథుఁడు నా
యెదలోనె పాయకున్నాఁ డీతఁడు

చి.శృం.రేకు:	03-5	కేదారగౌళ	సం:	10-016

పల్లవి:	పడఁతి నీయాసనె బతి కున్నది
	యెడయక నీవింక నెట్టయినాఁ జేయుమీ

చ. 1:	గుబ్బలమీఁద జెలి కొంగు వేయదు
	నిబ్బరపుమోహమున నిన్నుఁ దలచి
	గబ్బియైన మరునిచే కాఁకలు బెట్టు
	అబ్బురపు విరహమూ నాఁపలేక వున్నది

చ. 2:	పాలఁతి మేనఁ గస్తూరి వూయ నొల్లదు
	నెలకొన్న వలపుల నిన్నుఁ దలచి
	కలువ బాణాలచేతిగాసియూ బెట్టు
	బలిమైన తాపముల బారిఁ బడి యున్నది

చ. 3:	సతి నీవు గూడఁగాను సంతసించెను
	గతియైన శ్రీవెంకటనాథుఁడా
	యితవైన పాయము నీ కెక్కెను నేఁడు
	సతతము నిన్నుఁ గూడి చల్లనై వున్నది.

చి.శృం.రేకు: 03-6 శంకరాభరణం సం: 10-017

పల్లవి: తగు నీకు నాకును దయ్యమె కూరిచినాఁడు
నగవుల సరసాలె నయమాయ మనకు

చ. 1: జూటుఁజూపులనె నన్నుఁ జూచేటి వోజవరాల
సూటి నామనసు నీపైఁ జోటు గైకొనె
నాటుకొన్నతమకము నాకు నీకు నొక్కపాటె
యేటలమాయల యెర వేఁటి కింక మనకు

చ. 2: ఆనమాఁటలనె నన్ను నద్దలించే వోయింతి
వాసి నామోహము నీతో వావి గలసె
యీసుల మరనికాఁక యిద్దరికి నొక్కసరె
వేసాలజగడముల వేఁగ నేల మనకు

చ. 3: వలపులు చల్లి నన్నె వలవఁ దీసేటి కాంత
చెలిమి నే నీతోడఁ జేసితి నిట్టె
నలువైన శ్రీవెంకటనాథుఁడ నిన్ను గూఁడి
వులుకు లేక వుండఁగా నొనగూడె మనకు.

చి.శృం.రేకు: 04-1 కాంభోది సం: 10-018

పల్లవి: నాలితనా లేఁటికోయి నారసింహుఁడా
నాలోనె నవ్వు వచ్చీ నారసింహుఁడా

చ. 1: చేరువని ప్రియములు చెప్పి చెప్పి నామీఁద
నారువోసేవు వలపు నారసింహుఁడా
దారాసుద్దవుమాఁటలు తాఁకనాడి మదనుని
నారసాలు సేయకు నారసింహుఁడా

చ. 2: వెనుకొని నా వెంట వెంటఁ దిరిగి నామీఁద
ననుపు మోపు గట్టేవు నారసింహుఁడా
కనుచూపులనె వట్టి కాఁక రేచి మెత్తనైన
ననలు వాఁడి సేయకు నారసింహుఁడా

చ. 3: చిలుకుగోళ్ల నన్నుఁ జెనకుచు నీపై నా
నలు వెట్టె వచ్చేవు నారసింహుఁడా
కలికితనాన శ్రీవెంకటనాథ కూడితివి
నలువై వోగునూతుల నారసింహుఁడా

చి.శృం.రేకు: 04-2 ఆహిరి సం: 10-019

పల్లవి: మిక్కిలి నేరుపరివి మేలు మేలోయి
గుక్కనివలపుల వో కోన చెన్నరాయఁడా

చ. 1: గారవించి నామనసు కరఁగించ వచ్చేవు
వారకపు వలపుల దేవరవు గావా
పేరడి నీపెనపుల ప్రియములనె నన్ను
కూరిమి గొసరెటి వో కోన చెన్నరాయఁడా

చ. 2: మెచ్చి మెచ్చి నాతో నమ్మికమాఁట లాడేవు
తచ్చన వినయాల యాతఁడవు గావా
ముచ్చట నీజాణతనములనె నామీఁద గుది
గుచ్చేవు మాయ లెల్లాఁ గోన చెన్నరాయఁడా

చ. 3: యెన్నికసరసాల నా కిచ్చకాలు సేసేవు
కన్నెవలపు వేడుకకాఁడవు గావా
నన్ను నిట్టె శ్రీవెంకటనాథుఁడ కూడితివి
కొన్నదె కో లిఁక నీకుఁ గోన చెన్నరాయఁడా.

చి.శృం.రేకు: 04-3 మలహరిసం: 10-020

పల్లవి: చుల్లరవెట్టుఁ జేతల చొక్కనాథఁడు
వుల్లములో నీ నెలఁదలూరి చొక్కనాథఁడు

చ. 1: అద్దమరాతిరికాడ నంటువడి వచ్చి తాను
సుద్దు లేమి పచరించీఁ జొక్కనాథఁడు
వద్దు వొమ్మనవె రేపువచ్చుఁ గాని యిప్పు డేల
వొద్దికి వచ్చీ నెలఁదూరి చొక్కనాథఁడు

చ. 2: మిక్కిలిఁ దా నెక్కడనో మీఁదువోయివచ్చి నేఁడు
చక్కటు లేమి చెప్పీనె చొక్కనాథఁడు
పెక్కు లేల నేనె పిలిపించఁగా వచ్చీ
వొక్కటిగా నీ నెలఁదలూరి చొక్కనాథఁడు

చ. 3: యిప్పుడె తా నెవ్వతెకో యెంగిలియై వచ్చియిట్టె
చొప్పులు మాస వచ్చీనె చొక్కనాథఁడు
కప్పురపుమోవి శ్రీవెంకటనాథుఁడె నన్ను
వొప్పుగాఁ గూడె నెలఁదలూరి చొక్కనాథఁడు.

చి.శృం.రేకు: 04-4 మేసబౌళి సం: 10-021

పల్లవి: సింగారపు మేనిచెలువరి యింత
చెంగలింతురా చెలువరీ

చ. 1: నెఱతనా లూరకె నెరపుచు యిట్టె
చిఱునవ్వు నవ్వేవు చెలువరీ
తఱి నగి నగి వాని దగిలీని అంత
చెఱఁగు ముట్టకువోయి చెలువరీ

చ. 2: నిలువున మోహము నింపుచు మాపై
చిలికించేవు చూపు చెలువరీ
నెలవైన మాఁటలె నిజ మయ్యీని మాకు
శెలవు సేయకు వోయి చెలువరీ

చ. 3: వొక్కటిమాఁటల నొడఁబరచి నా
చెక్కు నొక్కకు వోయి చెలువరీ
గక్కన శ్రీవెంకటనాథుఁడా నీకు
జిక్కితి కాఁగిట చెలువరీ.

చి.శృం.రేకు: 04-5 సాళంగనాట సం: 10-022

పల్లవి: దొరపు నిన్నోఁగా దని దూరవచ్చునా
అరిదిపడేము గాక యాదవనారాయణా

చ. 1: నిమ్మపంట వేయగాను నిక్కము వచ్చే వని
నమ్మితిఁగా యాదవనారాయణా
చిమ్ముల నాచూపులకు చిక్కినట్టె వుండితివి
అమ్మరో యింత సేతురా యాదవనారాయణా

చ. 2: పువ్వులు నీ వంపఁగాను పులకించి సంతోసాన
నవ్వితిఁగా యాదవనారాయణా
దవ్వులనుండె నాకు దక్కినట్టె వుండితివి
యౌవ్వనపుమదమున యాదవనారాయణా

చ. 3: యింటికి నీవె రాఁగా యిప్పు డిట్టె భ్రమసితి
నంటుఁజూపుల యాదవనారాయణా
వెంట వెంటఁ దిరిగి శ్రీవెంకటనాథుఁడవై
అంటుకొని కూడితివి యాదవనారాయణా.

చి.శృం.రేకు: 04-6 రామక్రియ సం: 10-023

పల్లవి: వద్దు నాతో వెచ్చి వేవని మాయలు
వుద్దండపు వో సంబటూరి చెన్నరాయఁడా

చ. 1: అమ్మమీఁద నానవెట్టి ఆసవుట్టె మాఁటలాడి
నమ్మించ వచ్చేవు నాకుఁ గొత్తలా
సమ్మతి నీ వలపుల సతులవద్దికె పోయి
యెమ్మెలు నెరుపేవారి నెలయించవయ్యా

చ. 2: మానము సోఁకనాడి మచ్చిక బాస లిచ్చేవు
యీనెపాలెల్లా నే నెఱఁగనివా
వూనినవేడుకల నీ వువిదలతోడుతను
నీ నేరుపు సట లెల్లా నెరపవయ్యా

చ. 3: కాఁగిటికిఁ జేరఁ దీసి కన్నుల మొక్కులు మొక్కి
ఆఁగేవు నేఁ దెలియనిపనులా
నాఁగువార శ్రీవెంకటనాథ నన్నుఁ గూడితివి
యేగి వచ్చి యిట్టె మాయింట నుండవయ్యా

ఛి.శృం.రేకు: 05-1 మాళవిగౌళ సం: 10-024

పల్లవి: తియ్యనిమాఁటలఁ దేలించేవూ
వొయ్యారపు వూటుకూరి చెన్నరాయ

చ. 1: పిలిచే వూరకె పిన్ననాఁటి పొందు
గలవానివలెనె యాఁకటతోడ
చలిమినె నన్నింత సందడి సరసాల
వులికించకు వూటుకూరి చెన్నరాయ

చ. 2: చెనకే వూరకె చేవమీరి కడు
చనవరివలెనె ముచ్చటతోడ
పెనఁగుచు నీ విట్టె ప్రియములు నెరసేవు
వునుపుఁజేతఁల వూటుకూరి చెన్నరాయ

చ. 3: తివిరే వూరకె దిట్టతనమునను
కవగూడే ననుచు నక్కరతోడ
నవకపు శ్రీవెంకటనాథ నన్నుఁ గూడి
తువిదలలో నూటుకూరి చెన్నరాయ.

చి.శృం.రేకు: 05-2 దేసాళం సం: 10-025

పల్లవి: నేఁడు నీచేఁత లెల్లా నీ వెరఁగవా
నీడనుండె యలసేవు నీ వెరఁగవా

చ. 1: వేమారు నాచేత వెళ్ల నాడించ నేఁటికి
నీమనసులోని కల్ల నీ వెరఁగవా
దీమసానఁ బెక్కిండ్లు దిరిగి వచ్చేవాఁడవు
నేమపు నీగుణములు నీ వెరఁగవా

చ. 2: గుట్టున నుండక నాకుఁ గోపము రేఁచ నేటికి
నెట్టన నీనడవడి నీ వెరఁగవా
చుట్టాలసురభి వని సోఁకనాడినంతలోనె
నిట్టచూపులు చూచేవు నీ వెరఁగవా

చ. 3: పన్ని నీనిజము లీడఁ బచరించ నేఁటికి
నిన్నటి నీసుద్దు లెల్లా నీ వెరఁగవా
నన్ను నిట్టె శ్రీవెంకటనాథుఁడ నీవె కూడి
నిన్ను నన్ను మెచ్చేవు నీ వెరఁగవా.

చి.శృం.రేకు: 05-3 రామక్రియ సం: 10-026

పల్లవి: మేలు మేలె నిన్ను నీవె మెచ్చుకొనవే
కోలుముందైన పనులకు కొంకఁ దగునా

చ. 1: పచ్చిగా గుబ్బలమీఁది పయ్యద జారినందుకు
యెచ్చరించితేఁ గోపించే వేమాయనే
కచ్చు పెట్టి యింత వాసి గలదానవు నీవు
మెచ్చి మెచ్చి నన్నుఁ జూచి మెయి మరవఁదగునా

చ. 2: అక్కరైన మోహముతో నరగన్ను మొగిచినందు
కిక్కు వంటితేఁ గోపించే వేమాయనే
చిక్కక మనసులోన సిబ్బితి గలదానవు
గక్కన నాయెదుటను కరఁగఁగ దగునా

చ. 3: పొంతనె నామోహముతో చూచి పులకించినందుకు
యెంత నేఁ జేసినా నందు కేమాయనే
కంతుని కేలిని శ్రీవెంకటనాథుఁడఁ గూడఁగా
వంతుకు నీ కింత పరవశము గాఁ దగునా.

చి.శృం.రేకు: 05-4 సాళంగనాట సం: 10-027

పల్లవి: రచ్చ కెక్కితివి పండరంగివిఠలా
పచ్చిదేరే వింతలోనె పండరంగివిఠలా

చ. 1: గుట్టుగల దొర వని కొసరి చూచినంతనె
రట్టుగా నవ్వేవు పండరంగివిఠలా
మట్టుమీరి తమకపు మాఁటలనె నీవలపు
బట్టబయలె సేసేవు పండరంగివిఠలా

చ. 2: సాగినసబలలోన సన్న సేసినంతలోనె
రాగిదేలించేవు పండరంగివిఠలా
వేగిరపుఁ జేఁతలనె విరివి నీమోహ మెల్ల
బాగుగా వెల్ల వేసేవు పండరంగివిఠలా

చ. 3: తతి నీ వున్న చోటికి దగ్గర వచ్చినంతనె
రతిఁ గూడితివి పండరంగివిఠలా
గతి యైన శ్రీవెంకటనాథ యేలితివి
పతివై కోవిలకుంట్ల పండరంగివిఠలా

చి.శృం.రేకు: 05-5 శంకరాభరణం సం: 10-028

పల్లవి: చెల్లె నీవు సేసినట్టి చేఁత లెల్లాను
కొల్లలై కోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా

చ. 1: అసము దించక మాఁటలాడేవు గాక నాకు
వసమయ్యేవా యింతవన్నె కాఁడవు
కసిగాటువలపుల గబ్బివైన నిన్ను నేల
కొసరేఁ గోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా

చ. 2: సడికి వెరచి నాతో సరసమాడేవు గాక
తొడరేవా నీ వింత దొడ్డవాఁడవు
విడువని పొందులతో విట్టవీఁగేనీకు నేల
కొడిమె కోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా

చ. 3: బాసకు వెరచి నన్నుఁ బై కొని కూడితి గాక
ఆసగద్దా నీకు నింత అందగాఁడవు
వేసారవు రతుల శ్రీవెంకటనాథ వొకరి
కోసమా కోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా

చి.శృం.రేకు: 05-6 నాదరామక్రియ సం: 10-029

పల్లవి: వేవేలుచేఁతలవాఁడు వీఁడె వీఁడె
దేవుఁడుగదె ప్రసన్న తిరువెంగళప్పఁడు

చ. 1: యిద్దరు సతులు తన యిరువంకలఁ గొలువ
గద్దెన చూపులనె కరఁగింపుచు
అద్దరిపాటు సేసి ఆయములు ముట్టీని
తిద్దిన గోళ్ల ప్రసన్న తిరువెంగళప్పఁడు

చ. 2: కామినులు నలువంక కదిసి సేవలు సేయ
సామపు మాటలనె యాసలు సేయుచు
దోమటి చెనకులనె దుండగాలు సేసీని
దీమముతో ప్రసన్న తిరువెంగళప్పఁడు

చ. 3: అలమేలుమంగ దన కాకుమడి చియ్యఁగాను
సొలపుల మాఁటలనె చొక్కింపుచు
నలువై శ్రీవెంకటనాథుడై కూడినవాఁడు
తెలిఁగన్నుల ప్రసన్న తిరువెంగళప్పఁడు

చి.శృం.రేకు: 06-1 సామంతం సం: 10-030

పల్లవి: ఇన్నాళ్ల నీవుగావో యెప్పటి నేనె కానో
వెన్నుఁడ నీచేఁతలె వింత లింతే కాక

చ. 1: దాఁపరాని చెక్కుగోరు తలపించె నీగుణాలు
మాపుదాఁకాఁ దెలుపఁగ మావసమా
ఆఁపరాన తమకాన ఆపె నీమోహ మెల్లా
రూపు సేయఁగా నింత రూఢి కెక్కెఁ గాక

చ. 2: అంటినమోవిపై కెంపె అంగమచ్చమాయఁగాక
నంటునఁ దారుకాణించ నావసమా
యింటికాడ నిన్ను నాపె యెనసిన భోగ మెల్లా
వెంట వెంటనె వెల్లవిరి సేసెఁ గాక

చ. 3: విడువనివాసనలె వెలయించె నీపొందులు
వడి నీతో వాదించ వసమా నాకు
కడువేగ శ్రీవెంకటనాథ నీవె నన్ను
వొడఁబరచి కాఁగిట నొక్కటై కూడితివి.

చి.శృం.రేకు: 06-2 శంకరాభరణం సం: 10-031

పల్లవి: వలపులకలగంప వాని కేమె
వలరాజుఁ గన్న తండ్రి వాని కేమె

చ. 1: వాడికగాఁ దానె యెవ్వతెనైనా వలపించు
వాడనివాసనపువ్వు వాని కేమె
వోడఁ డెందరికినైనా వుత్తరువె చెప్పీని
వాడమగువలవిందు వాని కేమె

చ. 2: తగిలి యెక్కడ నైనాఁ దనమేలె చూచుకొను
వగలమగతుమ్మిద వాని కేమె
తగిన ట్టిందరితో దరితీపులె సేసు
వగకాఁ డల్లారుముద్దు వాని కేమె

చ. 3: యెనసి యెక్కడనైనా యిచ్చకమె సేసుకొను
వనితల పెనుబాఁతి వాని కేమె
ఘనుఁడు దానె శ్రీవెంకటనాథుఁడు వచ్చి
వనజాక్షి ననుఁ గూడె వాని కేమె.

చి.శృం.రేకు: 06-3 ముఖారి సం: 10-032

పల్లవి: తమకపడ నేఁటికి దాని కేమి దోసమా
అమర మన సిచ్చి మాఁటాడవయ్య విభుఁడా

చ. 1: మోవనాడి పిలిచినా మోనాన నున్నాడవు
చేవల నామాఁటలకు సిగ్గాయనో
మావంటివారితోడ మాఁటాడవల దని
మోవిమీఁద నెవ్వతైనా ముద్ర వెట్టెనో

చ. 2: కాతరానఁ జెనకినా కడుఁగడుఁ జొక్కేవు
ఘాతల నాచేఁత లేమి కళ లంటెనో
జాతిగా మాతోడుతను సరస మాడకు మని
చేతుల నెవ్వతైనా లచ్చెన వెట్టెనో

చ. 3: కమ్మి నేనిన్నుఁ గూడఁగా కప్పుకొనేవు నాకొంగు
యిమ్ముల నీ కిది దానె యితవాయనో
నమ్మి కిచ్చి శ్రీవెంకటనాథ వెనకదినాల
రొమ్ముపై నెవ్వతైనా గురుతు వెట్టెనో

చి.శృం.రేకు: 06-4 ఆహిరి సం: 10-033

పల్లవి: నన్ను నేఁ బొగడుకొన్నా నాయము గాదు గాక
కన్నెనాటనుండి నీకెకాఁ బాటువడనా

చ. 1: అ యింటివారిచే నారడిఁ బడితిఁగా
నెయ్యపు వలలఁ జిక్కి నీకొరకు
గయ్యాళి నావలపులు కతలై నిలిచెఁగా
వెయ్యైనాఁ దలచుకొంటె వెనకముందరికి

చ. 2: అక్కటా చెలులతోఁ గల్లానలు వెట్టితిఁగా
పక్కన నీవిచ్చినట్టి బాసలు నమ్మి
రొక్కమైన నాపొందులు రోఁకటఁ బాడిరిగా
దిక్కులు నిండెఁగా నీవు తెలియకుండినను

చ. 3: చెల్లఁబో యిందరిలోఁ బచ్చి సేయించుకొంటిఁగా
యిల్లు వెళ్ల నట్టి నీ యిచ్చకానకె
కల్ల లాడక శ్రీవెంకటనాథ కూడితివి
మల్లడి యీరతి మనమనసు లెరుఁగుఁగా

చి.శృం.రేకు: 06-5 పాడి సం: 10-034

పల్లవి: ఇంతేసి పొరుపత్తే లేమీ నీకు
అంతంతకు గరిసించే వత్తునా నే నీకు

చ. 1: కూడఁ బారివచ్చి నా కుల మేల యడిగేవు
వేడుకకాఁడ నాతో వియ్య మందేవా
నాడొడివటనె నాప రే లడిగేవు
చేడెలపైఁ బద్దేలు చెప్పుదువో నీవు

చ. 2: సరసానఁ జెయివట్టి సత్తు వేమి చూచేవు
బిరుదుకు నాతోడఁ బెనఁ గేవా
సొరిది నాపై నోరచూప లేమి చూచేవు
తిరిగి తిరిగి వంక దిద్ద వచ్చేవా

చ. 3: ముద్దు ముద్దువలె నాకు మొక్కు లేమి మొక్కేవు
కొద్దిమీర నీవు నన్నుఁ గోలిచేవా
అద్దొ మండెమురాయఁడవై నన్నుఁ గూడితివి
గద్దరివైన శ్రీవెంకటనాథుఁడా

చి.శృం.రేకు: 06-6 వరాళి సం: 10-035

పల్లవి: వలుపేమి దాఁగునా వన్నెకాఁడ
అలవడి నీ వెంత అణఁచఁ జూచినను

చ. 1: గక్కన మొక్కకుంటేను కాంత నిన్ను దీవించునా
తక్కి మాతో సిగ్గువడి దాఁచేవు గాక
చక్కఁగా నవ్వ కుండితె సరసము లాడునా
లెక్కించి మాకు వెఱచి లే దనేవు గాకా

చ. 2: చెనకక నీ వుంటె చెలి పూవుల వేసునా
పొనిగి మాతో లేదని బొంకేవు గాక
గునిసి యరువకుంటె కొంగు నిన్నుఁ బట్టునా
తనివోని నీననుపు దాఁచేవు గాకా

చ. 3: కన్నుసన్న సేయ కుంటె కాఁగిట నిన్నుఁ బట్టునా
అన్నిటా మాతోడుతఁ దోశాడేవు గాక
వెన్నడించి యాపెను శ్రీవెంకటనాథుఁడ కూడి
మన్నించితి నన్ను నిట్టె మండెమురాయఁడవె.

ఛి.శృం.రేకు: 07-1 రామక్రియ సం: 10-036

పల్లవి: తెఱవ లందరుఁ గూడి తిద్దిరిగా నిన్నును
మఱపు వెఱపు లేక మాకొరకుఁగానె

చ. 1: కన్నులనె వలపించే కాంతలు గలుగఁగా
పిన్ననాఁడె గుణములఁ బెద్ద పైతివి
మున్నిటివారి యధరముల తేనె సోఁకఁగా
తిన్నని నీమాటలకు తీపు లెక్కెను

చ. 2: యిచ్చకాన సింగారించే యింతులు గలుగఁగా
కచ్చుపెట్టి యింత వన్నెకాఁడ వైతివి
మచ్చికతోడ నందుక మరిగి రాఁగా గఁదా
నిచ్చలపుఁ బిల్లఁగోవి నెరజాణ వైతివి

చ. 3: తరుణులు నీతో జాణతనము లాఁడగఁగా
గరువతనాన మాటకారి వైతివి
కరఁగి వారెల్లా శ్రీవెంకటనాథ కూడఁగాఁగా
పరువపు నారతి బెంబడి నోడ వైతివి.

చి.శృం.రేకు: 07-2 శంకరాభరణం సం: 10-037

పల్లవి: అన్నిటా నీదిద్దుబడె అది విచారించవయ్య
యెన్నుకొని నన్ను నేర మెంచకుమీ అయ్యా

చ. 1: నీవొళ్లి నేరము లెంచి నెరవాది నైతిఁ గాక
కావించి నేఁ దొల్లేమి కతకారినా
కోవరపు నీగుణాలు కోపము రేఁచెఁ గాక
కావలసి నేఁ దొల్లి గయ్యాళినా

చ. 2: సారె నీబాసతప్పులె చలపాదిఁ జేసెఁ గాక
నేరిచి నాయంత నేనె నిష్ఠూరినా
పేరడి నీయెడమాట పెచ్చు వెరిగించెఁ గాక
రారాఁపుల నేఁ దొల్లి రచ్చ కెక్కేనా

చ. 3: తక్కరి నీవిద్యలె దంటఁ జేసెఁ గాక నన్ను
గక్కనఁ దొల్లి కయ్యాన కాలు దవ్వేనా
కక్కసించి శ్రీవెంకటనాథ కూడితివి
లక్కవలెఁ గరగక లాఁతిదాననా.

చి.శృం.రేకు: 07-3 సాళంగనాట సం: 10-038

పల్లవి: తగవో బలిమో నీతలఁపై నాతోఁ జెప్పర
నగువమోముతోఁ గదిరినాథ నీవు

చ. 1: యేరా వొద్దన్న మాన విల్లురికి నాతోను
మీరి నవ్వేవు కోమటిమేనరికమా
వారము వజ్జ మనక వాకిట నన్ను నాఁగేవు
పోరచి మావారు నీకుఁ బోఁక వెట్టిరా

చ. 2: కొంత గొంత కోపించిన కొంగువట్టి నాతోను
రంతులు సేసేవు నీకు రాచబలిమా
వంతుకు వాసికి నన్ను వావిదేరఁ బిలిచేవు
కొంతైనా మావారు నీవుంకువ వట్టిరా

చ. 3: గబ్బినై యదలించిన కన్నుల మొక్కుచునన్ను
గొబ్బునఁ గాఁగిలించేవు గొల్లదోమటా
అబ్బురపు శ్రీవెంకటాద్రినాథ కూడితివి
సిబ్బితివాయఁ బెండ్లి సేసిరా నీకూ

చి.శృం.రేకు: 07-4 ఆహిరి సం: 10-039

పల్లవి: ఎందు కెందుకు గడించీ యిది యేమె
మందలించినదె మారుమాఁట లవునటె

చ. 1: చెనకి నన్నుఁ బట్టఁగ చెయి విదిలించితేను
కొనగోరు దాఁకినదె కొస రవునటె
పెనఁగి తనపై నానపట్టఁగానె లోఁగితేను
యెనసి తనచేతఁకు యియ్యకోలటె

చ. 2: పువ్విళ్లూర నవ్వఁగాను వూరకె కోపము రేఁగి
పువ్వుబంతి వేసితేనె పొందవునటె
రవ్వగాఁ దా దూరఁగాను రాఁగతనానఁ దిట్టెక
అవ్వల సిగ్గువడితె అస లవునటె

చ. 3: వెగ్గళించి తనుఁ దానె విడెము నా కియ్యఁగాను
దగ్గరి యందుకొంటేను తగు లవునటె
కగ్గు లేక శ్రీవెంకటనాథుఁడు గూడఁగ
అగ్గలమై కూడితేను ఆ లవునటె

చి.శృం.రేకు: 07-5 శంకరాభరణం సం: 10-040

పల్లవి: ఇది నీకె సమ్మతైతె యెవ్వరైనాఁ గాదనేరా
మదిలో నీ వేల కొంకు మానవో కాకా

చ. 1: పొలఁతి యంపిన లేక బూతులు దొరలఁ బోలు
వెలయ నే మడిగినా వెళ్లనాడవు
యెలమి నాపె కానికె యెంగిలై యుండఁగఁ బోలు
సొలసి చెలులకును చూప వైతివి

చ. 2: అతివంపిన యేకాంత మాయములుసోఁకఁబోలు
యితవై నీలోలోనె యిందుకొంటివి
సతి వంపిన పువ్వుల సవరము గాఁబోలు
తతి నేము దగ్గరిన దాఁచుకొంటివి

చ. 3: కలికి దగ్గరితేను కాఁకలు రేఁగఁగ బోలు
చెలరేఁగి పానుపు చేరఁబోతివి
వెలయ నిన్నును శ్రీవెంకటనాథ కూడఁగా
మెలుఁత మించఁగఁ బోలు మెచ్చుకొంటివి

చి.శృం.రేకు: 07-6 వరాళి సం: 10-041

పల్లవి: నీగుణా లేల మానీని నేనె వేసరఁ గాక
యేగతిఁ జెప్పినను నీయిచ్చ మానేవా

చ. 1: పోరి పోరి నేఁ జెప్పినను బుద్ధు లెల్లా నీ వాపెఁ
జేరఁబోయి కానికగాఁ జెప్పకుండేవా
గోరసేసి నడుమను గోళ్లురాచి నీ వలపు
పేరడిగా జగడాలు పెంచకుండేవా

చ. 2: అద్దలించి నేఁ బెట్టిన ఆన లెల్లా నీ వాపె
వొద్దఁ బోయి సూడిదెగా వొట్టకుండేవా
బద్దుల నేరుపు లెల్లా పచరించి నీ మోహము
పెద్ద సేసి కైలాటాలు పెట్టకుండేవా

చ. 3: పాసి పోకు మని నిన్ను బలిమి నేనేఁ గొన్న
బాస లాపెకుఁ గప్పము పట్టకుండేవా
గాసి చేసి నిన్ను శ్రీవెంకటనాథ కూడితిని
ఆసపడి నీ వాపె నంటకుండేవా.

చి.శృం.రేకు: 08-1 శ్రీరాగం సం: 10-042

పల్లవి: సంగతిగా మాఁటలాడ జాణ వౌదువె నీ
సంగతి గలదు గాన జాణనె పో యెపుడు

చ. 1: యెక్కువఁ బయ్యదలోని వేఁటివె యింతి అవి
పక్కనె వలపు నించే పైఁడికుండలు
పెక్కువ మేడలమీఁదఁ బెట్టవచ్చుఁబో నీవు
మిక్కిలి నెప్పుడు నుండే మేడవో నాదేహము

చ. 2: హెచ్చె నీమైఁ బులక లివేఁటికె యింతి అవి
ముచ్చట మోహపునోము మొలకలురా
పెచ్చుగా దేవరమీఁదఁ బెట్టచ్చుఁబో నీవె
వచ్చి వరము లిచ్చే దేవరవెపో నాకును

చ. 3: యినుమడించెఁ జెమట లేఁటికే యింతి రతిఁ
దనివోని కళలెల్ల దైలువారెరా
అనువై అట్లానైతె అగ్గువాయఁబో నన్ను
ఘనమై కూడితి శ్రీవేంకటనాథుఁడా.

చి.శృం.రేకు: 08-2 శంకరాభరణం సం: 10-043

పల్లవి: ఎంచి మీచుట్టరికము లిందులో దెలుసుఁగా
మించి నడచితి రైన మీకు మీ యాన

చ. 1: యేలా చల్లనిగాలి యింతి నేచ నేఁటికి
జాలి రేఁచితైన నీకు చందన మాన
మేలిమి తుమ్మిదలాల మెలుఁత వోరువ లేదు
కోలుముందై కూసిన మీకులము నాన

చ. 2: మదనుఁడా చెలిమీఁద మానవయ్య కోపము
పదరితి వైన పంచబాణము లాన
పొదలినా చందమామ పున్నమవెన్నెల గాసి
కదిసి యెంచితి వైన కలువ లాన

చ. 3: చక్కని కోవిలలాల జవరా లోపఁగ లేదు
చిక్కని కూఁత రేఁచితే చిగురు లాన
గక్కన నింతిని శ్రీవెంకటనాథుఁడు గూడె
మక్కువ నిందరికిని మానితి నాన

చి.శృం.రేకు: 08-3 పాడి సం: 10-044

పల్లవి: ఆతఁ డేమి దవ్వుగాఁడు అతివ ప్రాణనాథుఁడె
నీతితోడ వానిఁ గూర్చి నెలఁతఁ గావఁగదరే

చ. 1: చల్లనైన గాలిచేత జాలిరేఁచె వలపు
పిల్లఁగోవి వట్టె వాఁడు పెచ్చురేఁచెనే
పొల్లవోని పూవులపప్పాడి పోదిసేసెనే
వొల్లనన్నఁ బోదు దీని కోమరమ్మ చెలులు

చ. 2: రవ్వలైన వెన్నెలల రాఁపాయ మోహము
నవ్వి నవ్వి వాని చూపు నామురేఁచెనే
కొవ్వినట్టి కోవిలలకూఁతచేఁత గనమాయ
యెవ్వ రేమి సేతు రిఁక యెదరమ్మ దీనిని

చ. 3: మదను పూవుటమ్ము సోఁకి మదము రేఁగె ప్రేమము
కదిసి విభుఁడు మోము చూపి కళలు రేఁచెనే
యిదివో శ్రీవెంకటనాథుఁ డింతి నిట్టె కూడినాఁడు
చెదరనట్టి వేడుకెల్ల చెందెనమ్మ యింతికి

చి.శృం.రేకు: 08-4 సామంతం సం: 10-045

పల్లవి: వెలఁది నీ చెమటలె వెల్ల వేయఁగా
తలఁగి నేఁ జెప్పకుంటే దాఁగఁ బొయ్యీనా

చ. 1: సంగతి నీమోహ మెల్లా సకితోఁ జెప్పఁగఁ బోతే
అంగడిఁ బెట్టెకు మని ఆనవెట్టేవే
దొంగిలి గజ్జలపేరు తొలఁగఁ బెట్టెఁగఁ బోతే
వెంగలితనమె కాక వినక మానేరా

చ. 2: యీకడ నీ విరహము యింతితో జెప్పఁగఁ బోతే
కాకుసేయ వద్దంటా కన్ను గీఁటేవే
పైకొని కన్నులు మూసి పాలు దాగఁబోతేను
జోకగా నింటివారు చూడక మానేరా

చ. 3: జిగి విభుని దెమ్మని చెలులతోఁ జెప్పఁబోతే
అగడు సేయకు మని ఆన వెట్టేవే
నగుతా శ్రీవెంకటనాథుఁడె తా నిన్నుఁ గూడె
చిగిరింపుఁ గోరికల చేఁత డాఁగీనా.

ఛి.శృం.రేకు: 08-5 వరాళి సం: 10-046

పల్లవి: తెలిసినమాఁట తేటతెల్లమిగాఁ జెప్పేను
తలిరుఁబోణి విభునిదండ నుండవలెనా

చ. 1: ముదిత మేని పులక మొలకలు పన్నీటి
పదనునఁ దీఁ గెలువారీఁ జుండి
కదిసి వోచెలులాల గందవొడి పొదిచేత
అదన నవియుఁ బొదలయ్యీఁ జుండి

చ. 2: చెలి చనుఁగొండలపై చెమట వూట పూఁదేనె
నలుకఁగాఁ గాలువలయ్యీఁ జుండి
కలికికోరికలచే కన్నుల నీరు గూడఁగా
యిలపై మదనుపేరి టేరులయ్యీఁ జుండి

చ. 3: కాంతమదిలోఁ బతి గడు గడుఁ దలఁచఁగా
అంతటా నాతఁడె తా నయ్యీఁ జుండి
వింతగా నింతిని శ్రీవెంకటనాథుఁడు గూడె
పంతమునఁ జెలికిఁ దాపము మాఁనె జుండి.

చి.శృం.రేకు: 08-6 వరాళి సం: 10-047

పల్లవి: ఆపె యెరుఁగును నీ వన్నియూ నెరుంగుదువు
రేపు మాపు నే నెచ్చరించేనా విభుఁడ

చ. 1: చిలుకచే మాఁటలు చెప్పెంప్పి మరు
చిలుకలపాలుగఁ జేయ నేల
కల గని లేచి లేకలు వ్రాసి కాఁ
కలఁ బొరలుచునె నీకడ కంపెఁ జెలియా

చ. 2: కడువేగ ముదుర వుంగరమె యంపి మరు
కడివోని బాణాలఁ గాఁచ నేల
బడి బడి విరహనఁ బడలేక మా
పడఁతి నీకుఁ జిత్తరుపట మంపె నిదివో

చ. 3: విందువలెఁ గప్పురపు విడె మిచ్చి గో
విందుఁడ వయిన శ్రీవెంకటనాథ
కందు లేనివేడుక నాకందుకొని నీ
కందువ లంటి కూడెఁ గాంతయు నిన్నిపుడూ

చి.శృం.రేకు: 09-1 కేదారగౌళ సం: 10-048

పల్లవి: ఎందరి దూరె యెవ్వరి వేఁడె యెంతని వేగించేనె
పొందు దలఁచుక వచ్చెనా వానిచే పుణ్యమింతే కాక

చ. 1: పుక్కిలిబంటి కాఁకలలోనె పొద్దువోవు టెట్లే
యెక్కువైన నా వమోహము చెలుల నెరఁగ రేమందునే
వొక్కనిమిషము వానిఁ బాసి నేవోరువఁ గలనటే
మొక్కళీఁడయిన మరునమ్ములకు మొకవమోట గలదా

చ. 2: తలమునుకల విరహము నే ధరియించు టెట్లే
వల పెరిఁగియు సకులు మీరైన వానిఁ దే రేమందునే
అలిగినవానిఁ బాసి నిమిషము ఆఁపఁ గలనటవే
దళమై కప్పెటి పూవుటమ్ములకు దయగల దటవే

చ. 3: ఇట్టె యీఁదరాని తమకముననె యీడేరే దెట్లే
వొట్టిన నా కాఁక లెరిఁ గింతు లూరకున్నారేమందునే
నెట్టెన శ్రీవెంకటనాథుడు నేఁడు నన్నుఁ గూడెనే
గట్టిగ నాయింట కాఁపురమున్నాఁడు కడమలున్న వటే

చి.శృం.రేకు: 09-2 పాడి సం: 10-049

పల్లవి: అతనినె దూరరమ్మ అలుగ కుండిన నాఁడు
యీతల నాతల నివి యితవుగా కుండెనా

చ. 1: పున్నమచందురుఁడు దప్పులురేఁచ బగవాఁడ
ఇన్నిటా నా విభుఁడె గురింతె కాక
సన్నపు జల్లనిగాలి జాలి రేఁచఁ బగవాఁడ
మన్నమగఁడు సేసిన మతకము గాక

చ. 2: కమ్మని పువ్వులు మేను కాడిఁపార సూడుగద్దా
చిమ్ముల నా రమణుని చేఁతలె కాక
దొమ్మిసేసి తుమ్మిదలు తొలియాడ వైరులా
నమ్మించి బాస దప్పిననాథుఁ డింతె కాక

చ. 3: ముప్పిరి మరుఁడు కాక ముంచఁగ దోసమువాఁడ
యెప్పుడు నీచేఁతలు ప్రాణేశువె కాక
కప్పుచు నన్నును శ్రీవెంకటనాథుఁడు గూడె
అప్పట్టప్పటి చేఁతలు ఆతనివె కాక

చి.శృం.రేకు: 09-3 బౌళి సం: 10-050

పల్లవి: నీ వేమి సేతు వాపె నిన్నుఁ బెరరేఁచగాను
తావుల సాకిరి గోరఁ దగదా నిన్నును

చ. 1: పోరాడే వాపెకుఁగా వూనుక నీవు రాఁగా
మేరతోఁ జూట్టా లెల్లా మెచ్చకుండేరా
సారె సారెఁ బిరిదూరి సాకిరులు చెప్పఁగాను
తీరిచేటి చెలు లెల్ల దీవించకుందురా

చ. 2: కన్నుగీఁ టాపెకు నాకుఁ గై లాటాలు వెట్టఁగాను
కన్న విన్న వారెల్లాఁ బొగడకుండేరా
మన్నించి యాపెకు నీవు మాఁట లందియియ్యఁగాను
సన్నల వాడవారెల్లా సంతసించకుందురా

చ. 3: సందడి జగడాలలో సారె నన్నుఁ బట్టఁగాను
అందరును నిన్నె మేలనకుండేరా
అంది శ్రీవెంకటనాథ ఆపెను నన్నుఁ గూడితి
విందురు నీచేఁత లివి యెంచకుండేరా.

చి.శృం.రేకు: 09-4 వరాళి సం: 10-051

పల్లవి: నీ వేల వత్తువయ్య నెలఁతఁ బాసి
మావంటివారు నీకు మనసయ్యేరా

చ. 1: ఇప్పటికి మాతోడ యిచ్చక మాడేవు గాక
తప్పరాని బాస నీవు దాఁటఁ గలవా
అప్పసమై తలఁపెల్లా ఆపెకుఁ గుదువవెట్టి
దెప్పరమై మావెంటఁ దిరుగ నోపుదువా

చ. 2: నిక్కమువంటి మాఁటలే నెరుపేవు గాక నీవు
వొక్కమనసై యీడ నుండఁ గలవా
అక్కజపు నీమేను ఆపెకు మీదుచ్చి
యిక్కడ మాతొంటిపొందు యితవయ్యీనా

చ. 3: ముచ్చట సేక మాతో మొగమోడే వింతే పక్క
మచ్చికయాపె కాఁగిలి మాన గలవా
కచ్చుపెట్టి నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
యెచ్చరిక నిట్టె మాయింటికి రాఁగలవా

చి.శృం.రేకు: 09-5 దేసాళం సం: 10-052

పల్లవి: కలితె నానతీవయ్యా కానిదానికి నేమి
చెలరేఁగి ఆపె మాఁట చెల్లించేఁ గాని

చ. 1: వెడ్డువెట్టి నే నిన్ను వేడుకతోఁ గొసరఁగా
అడ్డాలు వచ్చీ నాకంటే నంత చుట్టమా
వొడ్డినగర్వాన నాతో వొరగోసుకొన్నది
సడ్డలాడి నీ వింత చనవు లిచ్చితివా

చ. 2: బాసగొని నే నిన్ను పై పైఁ బలుకఁగాను
యీసడించీ నాకంటే యితవరా
గాసిలి మచ్చరాన నీకాంత మాసటీనివలె
సేసిన చేఁతల కల్లా చెల్లుబ డిచ్చితివా

చ. 3: యీపొద్దె నిన్ను మాయింటికిఁ దోడుక పోఁగా
కోపగించీ నాకంటెఁ గూరిచినదా
కైపు గాక నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
పై పై నాపెకుఁ బారుపత్యము లిచ్చితివా.

 చి.శృం.రేకు: 09-6 పాడి సం: 10-053

పల్లవి: కాదని వేగిరించితే కరఁగీనా ఆతఁ డేమి
వాదు మాని వచ్చినట్టె వచ్చేదె చాలును

చ. 1: మాఁట లాడించకురే మదనమంత్రాలు దప్పి
నేఁటిదాఁక నాపెవద్ద నేరిచినవి
నీటుతోడ నాతనిని నిండునిధానమువలె
సూచీచూపుల మనము చూచేదె చాలును

చ. 2: గందము వూయకురే యంగజునిముద్రలుమాసీ
కందువ నిన్నాళ్ల దాఁకా గడించినవి
దిందుపడ నుపారము దేవరకుఁ జూపినట్టు
ముందర నన్నియుఁ బెట్టి మొక్కేదె చాలును

చ. 3: మల్లాడి తియ్యకురె మన్మథయోగ మెడసీ
తొల్లియూ నాపెవలన దొరకినది
కల్ల గాదు నన్ను శ్రీవెంకటనాథుఁడె కూఁడె
చెల్లుబడి నీచనవు చేకొనేదె చాలును

చి.శృం.రేకు: 10-1 మాళవిగౌళ సం: 10-054

పల్లవి: మంచితనము ల దెట్టు మరచీనయ్యా
మంచముపై నున్న నెట్టు మరచీనయ్యా

చ. 1: యెచ్చరించి వొక రొక రెనసి కూడుండేటి
మచ్చికలు చెలి యెట్టు మరచీనయ్యా
వచ్చినదాఁకాఁ దలవాకిటనె కాచుకుండే
మచ్చులచేఁత ల దెట్టు మరచీనయ్యా

చ. 2: యిత వెరిఁ గొక రొక రిచ్చకాలు సేసేది
మతిలోనఁ జెలి యెట్టు మరచీనయ్యా
సతతము నొండొరుల జవ్వనమె కుదువైన
మతములు చెలి యెట్టు మరచీనయ్యా

చ. 3: సంతసాన మనసులే సరిదాఁకినట్టి నీ
మంతనాలు చెలి యెట్టు మరచీనయ్యా
కాంతను నీవె శ్రీవెంకటనాథ కూఁడగాను
మంతు కెక్కె నిది యెట్టు మరచీనయ్యా

చి.శృం.రేకు: 10-2 భైరవి సం: 10-055

పల్లవి: తనువె యిక్కడఁ గాని తలఁ పెల్లా నక్కడనె
మనసులో నాపె నింక మానననైనఁ గలవా

చ. 1: మాయింటాడ నిచ్చకపు మాఁటలాడే వింతే కాక
వోయీ నీ వాపెఁ బాసి వుండ నోపేవా
ఆయెలే మాముందటను అసము దించవు గాక
చేయూర నీవె యాపెను చెనక కుండేవా

చ. 2: మానలేనివానివలె మన సరసేవు గాక
ఔనా ఆపె వద్దించ కారగించేవా
తేనెలమాఁటఁల దరితీపులు సేసేవు గాక
కానీలె యాపెపై తమకమె పట్టెఁగలవా

చ. 3: యీపొద్దుకు నాకాఁగిలి యింపాయ ననేవు గాక
పో పో నీవాపెఁ దలపోయ కుండేవా
కాపాడి నన్నును శ్రీవెంకటనాథ కూడితివి
మాపొందు లాసెవద్దను మఱవఁగఁ గలవా

చి.శృం.రేకు: 10-3 కాంబోది సం: 10-056

పల్లవి: ఇరుమొనసూది వనియింపు సేసుకుందుఁగాని
మరిగినే మన సిచ్చి మాఁటలాడఁ జాలరా

చ. 1: ఆపెతోఁ బురుడువెట్టి ఆడక వుండినఁ గదా
నాపై నీవల పెల్ల నమ్ము కుందును
చూపుల నాపె కెదురుచూడక వుండితేఁగదా
చేపట్టి నాముచ్చ టెల్లాఁ జెప్పుదు నీతోను

చ. 2: ఇచ్చక మాపె కాడక యీడనె వుండినఁ గదా
ఇచ్చిన నీబాస లెల్ల నియ్యకొందును
కచ్చుపెట్టి యాపెతో నేకతము మానినఁ గదా
తచ్చనలు మాని నీతో దగ్గరి నవ్వుదును

చ. 3: కడలు దొక్కక నాకాఁగిట నుండినఁ గదా
అడియాలముగఁ గళ లంటుదు నిన్ను
కడువేగ శ్రీవెంకటనాథ నీవె నన్ను
యెడయక వుండఁగానె యితవాయఁ గాకా

చి.శృం.రేకు: 10-4 నాదరామక్రియ సం: 10-057

పల్లవి: వేగిరమా నీవు విభుఁడవు నీ వెలఁదిని నేను
సొగకన్నుల నీసొలపు జూపులసొంపు నాకుఁ జాలదా

చ. 1: చెలియ మునుపు సింగారించుకొన్న చెంగావిచీర యిది నీవు
తలఁకక నేడు దట్టిగట్టుకొంటె దాని కేమిదోసమా
అలిగేనా నేను అందుండె మాఁటాడు అంటుకొన నోపను అది
తలఁగ వేరొక్క తావునఁ బెట్టిరా దగ్గరుందు గాకి

చ. 2: కందువతో నాపె కస్తూరి వూయఁగ గట్టిబేఁటులు రాలితే నీవు
పొందు చెడకుండ బొట్టు వెట్టుకొంటె బోగానకుఁ గడమా
నింద నిన్నాడేనా నేటి కటుండరా నే నందు కోరువనువొక
చందానఁ బన్నీట జలక మాడి నాసంగడికి రారా

చ. 3: ముద్దియ వేలనె ముందర నుండెటి ముద్దురవుంగరమునీవు
పెద్దరికానకు ప్రియమునఁ గేల బెట్టుకొంటేఁ దగదా
గద్దరివై శ్రీవెంకటనాథ నన్నుఁ గరఁగించి కూడితి నా
వద్దనె పాయక వాలాయించి దేవరవలె నుండరా.

చి.శృం.రేకు: 10-5 తెలుఁగుఁగాంబోది సం: 10-058

పల్లవి: చెప్పరె మీరైనా బుద్ధి చెలులాల
అప్పసము మా కదిరి యప్పనికి

చ. 1: యింతగా వలచినవాఁ డింటికి వచ్చితే నేమి
అంతలోఁ దనకును సిగ్గాయ నటవే
పంతము దప్పిపోయీనా పచ్చిదేరేమాఁటలను
అంతేసి తన్నుఁ దూరనాడఁ జాలఁ గాక

చ. 2: మన సిచ్చినట్టివాఁడు మాఁటలాడితే నేమి
తను నెవ్వరైనా వద్దనే రటే
చనుమొనలు సోఁకగాఁ జాణతనపుఁజేఁతల
చెనకలేనా కొంత చేకాచి కాక

చ. 3: కదిసినవాఁడు నన్నుఁ గాఁగిలించితే నేమి
అదను గాదా తనకు నడ్డమా యేమి
వెదచల్లుఁ గరిమి శ్రీవెంకటనాథుఁ డై కూడె
పదిలమై యిఁక దన్నుఁ బాయలేనుఁ గాకా.

చి.శృం.రేకు: 10-6 బౌళి సం: 10-059

పల్లవి: ఏలరా కృష్ణుఁడా

చ. 1: పగటూ మాఁటల నొగరూ దోఁచఁగ
మగనాలిని నన్ను నగఁ జూచే వేరా

చ. 2: కొనబూ విటుఁడ నీ కనుచూపులనె నా
మనసూ గరఁగించఁ బెనఁగే వేరా

చ. 3: కలికీచేఁతల వలపంచి నను నిట్టె
కలసితి శ్రీవెంకటగిరినాథా

చి.శృం.రేకు: 11-1 పాడి సం: 10-060

పల్లవి: అంత మనసరి వని ఆడేనా నిన్ను
చింతించే నీయాల ననే సిగ్గు కింతే కాకా

చ. 1: నవ్వులు నవ్వేవు నీవు ననుపువానివలెనె
యెవ్వతెతో నైనా న దేరా నీవు
దువ్వటపుఁ బయ్యదపైఁ దోగిన చెమట నీపై
చివ్వనగోళ్ల నాపె చిమ్మె ననీ కాక

చ. 2: ముచ్చట నెవ్వతె నైన మొకము దగ్గరఁ బోయి
యిచ్చకము లాడేవు యేరా నీవు
మచ్చిక నాపె నీతోను మారుమాఁట లాడఁగాను
తచ్చన వీడెపుటాలి దాఁకె ననీ కాక

చ. 3: చనవున మెచ్చి మెచ్చి సారెకు నెవ్వతె నైనా
యెనసి కాఁగిలించేవు యేరా నీవు
నను నిట్టె శ్రీవెంకటనాథుడ కూడితివి
అనువై యాపె వాసన లంటె ననీ కాక.

చి.శృం.రేకు: 11-2 శంకరాభరణం సం: 10-061

పల్లవి: నా కన్నిచేఁత లెల్ల నాయకుఁడ యియ్యకోలె
యీకడ నీవేడుక యీడేరితేఁ జాలును

చ. 1: దాపుగా వారింటఁ గాని దగ్గరి మాయింటఁ గాని
వోపికతో నీవు లెస్స వుంటేఁ జాలు
ఆపెవద్దఁ గాని అట్టె నావద్దఁ గాని
తీపు లైన నీముచ్చట తీరితేఁ జాలును

చ. 2: అతివచేతనె కాని అట్టె నాచేతఁ గాని
యితవుగా నీవు భుజియించితేఁ జాలు
సతమై యాపెతోఁ గాని జట్టిగా నాతోఁ గాని
బతిమివట్టినట్లాఁ బాయకుంటేఁ జాలును

చ. 3: అలయింతిరతిఁ గాని అట్టె నారతిఁ గాని
చెలువమై నీసుఖము చెల్లితేఁ జాలు
చెలరేఁగి యిద్దరిని శ్రీవెంకటనాథుఁడ
చలపట్టి కూడితిగా సత మైతేఁ జాలును.

చి.శృం.రేకు: 11-3 మాళవిగౌళ సం: 10-062

పల్లవి: ఇంచుక యస మిచ్చితే యెవ్వరూ నేల మానేరు
కొంచేవా నీ వికఁ గోన చెన్నరాయఁడ

చ. 1: మొగము చూచి వలచి ముందు ముందె నీకుఁగేలు
మొగిచి మొక్కినదె వె మాయఁగా
సగముచూపులఁ జూచి జాణతనా లాడేవు
తగునా చేఁతకు నీచేఁతలు వో విభుఁడా

చ. 2: కలికి నీచేఁతలకు కాఁక రేఁగి నాకు నేనె
నిలిచి మాటాడినదె నేర మాయఁగా
చిలుకుగోళ నూఁది చేరి సరస మాడేవు
తలఁపనందుకు నీవు తగునయ్య విభుఁడా

చ. 3: అగ్గలపు వేడుకతో నలపు దీర నీమీఁద
దగ్గరి చేయి చాచుటే తగు లాయఁగా
వెగ్గళించి కూడితి శ్రీవెంకటనాథుఁడ నన్ను
సిగ్గుదీర నిదె కోనచెన్నరాయఁడవై.

చి.శృం.రేకు: 11-4 సామంతం సం: 10-063

పల్లవి: ఆఁటదాన గనక నే నాసలు మానలేఁ గాక
యేఁటికి మాచక్కఁదనా లింపు గాని నీకున

చ. 1: వాడికై ననాఁటికి వలతు వింతే కాక
నేఁడు బాస చెల్లించ నీ కేలయ్యా
వాడుదేరుకూలికి వలచిని వలపులు
యీడేరించుకొనేది యింత పిన్నపనులా

చ. 2: పనిగల యప్పు డెల్లాఁ బైకొందు వింతే కాక
ననిచి యెప్పుడూ నేల నడుపేవయ్యా
చెనకి గడ్డాయముగాఁ జేసినబాస లెల్ల
అనువుగా నడపఁగ నల్లాడఁ బడెనా

చ. 3: చిత్తము నిలుప లేక శ్రీవెంకటనాథుఁడ
హత్తి కూడితివి గాక అల పేలయ్యా
కొత్తగాఁ దమకముఁ గూడినకూట మెల్లా
తత్తరపడక యుండఁ దమయిచ్చుటా.

చి.శృం.రేకు: 11-5 రామక్రియ సం: 10-064

పల్లవి: పింఛెపుతలజడల పిన్నవాడు
పెంచీనె వలపులు పిన్నవాఁడు

చ. 1: చనవరివలెనె వేసాలచేఁతలు సేసి
పెనఁగీ గుచములతోఁ బిన్నవాఁడు
ఘన మై ముద్దులు చూపి కరఁగించియింతలోనె
పెనపులఁ బెట్టీనె పిన్నవాఁడు

చ. 2: చెలిమికానివలెనె సిగ్గు వీడ మాఁటలాడి
పిలిచీ యేకతానకుఁ బిన్న వాఁడు
కులమువావులు చెప్పి గుట్టు దెలుసుక నాతో
పెలుచుమాఁట లాడీనె పిన్నవాఁడు

చ. 3: చిట్టకపు చేఁతలను చెనకి నావేలఁ దెచ్చి
పెట్టినె వుంగరము పిన్నవాఁడు
గట్టిగాఁ దానె శ్రీవెంకటనాథుఁ డై వచ్చి
బెట్టుగా నన్నుఁగూడెనే పిన్నవాఁడు.

చి.శృం.రేకు: 11-6 శంకరాభరణం సం: 10-065

పల్లవి: ఏఁటి కిఁక నాకు నీతో నెగ్గు లెంచను
మాఁటలాడినప్పుడె మానేనయ్యా కోపము

చ. 1: మాన లేక నీవు పెక్కు మానినులఁ దెచ్చినాను
దాని కేమీ నేను పెద్దదానవె కానా
నాననట్టివలపులు నాఁడు నాఁడె చవులు గావా
సానఁ బట్టినమణులు చాయలె కావా

చ. 2: పొందులె మానక నీ వేపొలఁతి యింటనుండినా
అందుకే మెపుడు నీకు నాలనే కదా
ముందు ముందె యిట్లానైన మోహములు తీపులే కా
యెందు నాఁక లైనవిందు యితవు లవునె కా

చ. 3: కళలు మించ నీ వెవ్వతెఁ గాగిలించుకొన్నానేమి
బలిమి నైన నావరుస పాయవే కదా
చెలిమి సేసేనాటిబాస శ్రీవెంకటనాథ నీవు
తలఁచి కూడితి నాతోఁ దనియక వుందునా.

చి.శృం.రేకు: 12-1 బౌళి సం: 10-066

పల్లవి: చిత్తమె చిమ్మి రేఁగితే సిగ్గేమి యెగ్గేమి
రుత్తవోని వేడుకల రుచి గన్నవారికి

చ. 1: మొక్కలానఁ దిట్టినాను మోహమెపెచ్చువెరుగు
దక్క వలచినయట్టి తరితీపున
వుక్కుగోరు సోఁకినాను వుపచార మై తోఁచు
నిక్క మై సరస మాడ నేరిచినవారికి

చ. 2: కాలు దాఁకించిన నైన కళ లంటిన ట్లౌను
వేళమె మోహించినట్టి వేడుకను
పేలరి మాఁట లాడిన ప్రియములై తోఁచును
వాలాయించి నను పైనవారికిని

చ. 3: ఎంగిలి సోఁకించినాను యిచ్చక మై తోఁచును
పొంగెటి తమకపు తీపులవేళను
చెంగలించె నీచెలియ శ్రీవెంకటనాథుఁ గూడి
అంగ మైన మండెమురాయఁడె తానై యుండఁగా

చి.శృం.రేకు: 12-2 పాడి సం: 10-067

పల్లవి: రావయ్య వావిలిపాటి రామచంద్ర
రావాడివలపులు రామచంద్ర

చ. 1: మూఁగినసబలలోన ముంచి మాఁటలాడఁగాను
రాఁగెఁగా నీ మోవికెంపు రామచంద్ర
మాఁగినమాఁటలనె మర్మము లెత్తితి నని
రాఁగతనాలు మానుమీ రామచంద్ర

చ. 2: బట్టబయలుమాఁటల బాసలు సేయ రాఁగా
రట్టాయ నీ సుద్దులు రామచంద్ర
గుట్టు దెలిసినందుకు కోపగించుకొనకుమీ
రట్టెడిచేఁతల వో రామచంద్ర

చ. 3: ఆసలమాఁటల నన్ను నలమి పట్టఁగ నిన్ను
రాసెఁగా నా కొనగోరు రామచంద్ర
వేసాలు మాని నన్ను శ్రీవెంకటనాథుఁడ వై
రాసి కెక్కఁ గూడితివి రామచంద్ర.

చి.శృం.రేకు: 12-3 దేసాళం సం: 10-068

పల్లవి: కాంతుఁడు మరునియాజ్ఞ కడవలేఁ డింతే కాక
కొంతైన నెరఁగఁడా కోన చెన్నరాయఁడు

చ. 1: వలపు నిలుప లేక వనితకు మొక్కెఁ గాక
సొలప వాఁ డటువంటి సుద్దులవాఁడా
చెలిమి విడువ లేక చెయివూఁత యిచ్చెఁ గాక
కొలమున నేమి తక్కువవాఁడా

చ. 2: ఆసలు మానఁగ లేక ఆకు మడి చిచ్చెఁ గాక
వేసాల వాఁ డటువంటి విద్యలవాఁడా
బాసలు దప్పఁగ లేక బడినె తిరిగెఁ గాక
యీసున దొరతనము లెఱఁగనివాఁడా

చ. 3: పొందు విడువఁగ లేక పొత్తున భుజించెఁ గాక
అందగాఁ డాతఁ డెంగి లంటేవాఁడా
అంది శ్రీవెంకటనాథు డాపెఁ గూడితే నేమి
చందముగా నాతోడి సమరతి మానేనా.

చి.శృం.రేకు: 12-4 వరాళి సం: 10-069

పల్లవి: మాటకు మాఁటె యాడి మంచితనము సేయక
నీటున సరస మాడ నేఁడు నాకుఁ జెల్లునా

చ. 1: ఘనుఁడ వంటా నీకుఁ గానుక చేతి కిచ్చితే
యెనసి నీ వాపెచేతి కియ్యఁ దగునా
ననిచి నీనేరమా నానేర మింతే కాక
నిను దొర వని నమ్మి నేస్తము సేసినది

చ. 2: కాంతుఁడ వనుచు నాపుంగరము వేలఁ బెట్టితే
అంతలో నాపె కిచ్చితి వది దగునా
అంతయు నీకడమలా అది నాకడమ గాక
వింత లేనిపొందు నీతో వేడుకఁ జేసినది

చ. 3: హితవరి వని నీతో నేకతము చెప్పితేను
అతివతోఁ జెప్పితివి అవురా నీవు
కతకారి శ్రీవెంకటనాథ నన్నుఁ గూడి
బతిమివట్టు కుండఁగా బాసడుగఁ జెల్లునా.

చి.శృం.రేకు: 12-5 ముఖారి సం: 10-070

పల్లవి: సవతుల మైనాను సంగతి దప్పఁ దగునా
రవళి వావిలిపాటి రామచంద్రుముందర

చ. 1: నీ వనఁగా నే ననఁగా నిష్టూరా లేఁటికే
చేవదేరే మాఁట లెల్ల చిగిరించీని
మోవరాని దూరు లెల్ల మోపులు గట్టఁగాను
వేవేగ నిన్నియు మనవిభుఁడు మోఁచీనా

చ. 2: కా దనఁగా నౌ ననఁగా కరక రేమిటికే
మీఁద మీఁద జగడాలు మితిమీరీని
వాదుల యీా సుద్దు లెల్ల వాములు వెట్టేఁగాను
కా దని మనవిభుఁడు గాదెలఁ బోసీనా

చ. 3: రమ్మనఁగ పొమ్మనఁగ రారాఁపు లేఁటికే
దొమ్మి రేఁగి కాఁకలు తోదోపు లాడీని
నమ్మించి శ్రీవెంకటనాథుఁడు నిన్ను నన్నును
సమ్మతిగాఁ గూడఁగాను సతము లై తిమిగా.

చి.శృం.రేకు: 12-6 రామక్రియ సం: 10-071
పల్లవి: కాంతాళించాడినమాఁట గాదు సుమ్మీ వోవిభుఁడ
దొంతిమాయలఁ జిక్కఁగ దొరలకుఁ జెల్లునా
చ. 1: వేడుకతో నీ వాపె వెంట వెంటఁ దిరుగగా
చేడెలలో నెల్ల నాకు సిగ్గాయరా
యీడు లేని వలపు నిన్నేరఁగని దింతే కాక
తోడనె యీ పను లెల్ల దొరలకుఁ జెల్లునా
చ. 2: వొయ్యనె నీ వాపెకు వూడిగాలు సేయఁగాను
నెయ్యపు నా కపు డెంత నెగు లాయరా
గయ్యాళితమి నీకు కన్నులఁ గప్పెఁ గాక
తొయ్యలికి నింత లోఁగ దొరలకుఁ జెల్లునా
చ. 3: ఆసపడి నీ వాపెకు అట్టె కొలువు సేయఁగా
యీసున నాకునుఁ గోప మెంత వచ్చెరా
కోసువానిపల్లెలోనఁ గూడి శ్రీవెంకటనాథ
తోసిపోవైతివి యింత దొరలకుఁ జెల్లునా.

 చి.శృం.రేకు: 13-1 దేసాళం సం: 10-072

పల్లవి: చాలు లేరె మీ రేల చక్కటులు చెప్పేరె
మేలు గలవారికి మెచ్చుకుండఁ జెల్లునా

చ. 1: వలచినవాఁ డైతె వద్దికి తా వచ్చుఁ గాక
అలిగి తా నెడమాఁట లాడించునా
చెలిమే కలిగితేను సిగ్గుపడవలెఁ గాక
వొలసీనొల్లముతో నూరకుండఁ జెల్లునా

చ. 2: ప్రియమే కలిగితేను పిలువ రావలెఁ గాక
దయ లేక యింతవడి తామసించునా
నయమే కలిగితేను నమ్మించవలెఁ గాక
భయము లే కింతవడి పట్టెడఁ జెల్లునా

చ. 3: ఆసలే కలిగితేను అలముకోవలెఁ గాక
యీసున మరి యెగ్గు లెంచఁ జెల్లునా
వేసాలు మాని నన్ను శ్రీవెంకటనాథుఁడు గూడె
వాసు లెంచి యాతఁ డిఁక వాదించఁ జెల్లునా.

చి.శృం.రేకు: 13-2 గౌళ సం: 10-073

పల్లవి: మేర లేనివల పిద మీ కేల తెలుసునే
యీరస మయ్యేబుద్ధు లేల చెప్పేరే

చ. 1: ఆఁట దెంత గబ్బి యన్నా ననుఁడ మీరిఁకవేయి
మాఁట లన్నా వాని నేను మాన లేనే
వేఁటలాడేమదనుఁడు విరహులఁ బొడగంటే
యీ టెలవంటి పూబాణా లేమరుండీనా

చ. 2: అమ్మరో యంతటికల్ల యన్నా నంటిరి గాని
వమ్ము వోని వానిపొందు వదల లేనే
కమ్మటిఁ జందురుఁడు కాఁకలఁ బొరలేవారిపై
కుమ్మువంటి వెన్నెలలు గుప్పకుండీనా

చ. 3: అతివ మారాడఁ జెల్ల దన్నా నంటిరి గాని
వెత లేనివానిరతి విడువ లేనే
కతకారై నన్ను శ్రీవెంకటనాథుఁ గూడె
యిత వైనకళ లెల్లా హెచ్చుకుండీనా

చి.శృం.రేకు: 13-3 ముఖారి సం: 10-074

పల్లవి: ఎక్కడి పరాకుననో యిందాఁకా నుండెఁ గాక
మక్కువ నాపై బత్తి మానలేఁడె వాఁడు

చ. 1: పాయరాని వలపులు పక్కనఁ దలఁచుకొంటే
రాయా మనసు గరఁగ కేమే
వో యమ్మలాల నావుంగరము చూపరమ్మ
వేయేల తా నిప్పుడే విచ్చేసీ నీడకే

చ. 2: వూనినట్టిసరసాలు వూహించుకొంటేను
మానా దేహము తమకించ కేమే
మానినులాల వొక్కమాఁట విన్నవించరమ్మ
తానె వచ్చి నన్నుసంతస మందించీనే

చ. 3: నేదదేరే చనవులు చిత్తమునఁ దగిలితే
దూదేవయ సేమి వూదితేఁ బోను
ఆదెస మండెమురాయఁ డైన శ్రీవెంకటనాథుఁ
డాదరించి నన్నుఁ గూడె నతివమోహముననూ

చి.శృం.రేకు: 13-4 సామంతం సం: 10-075

పల్లవి: ఈడేర వలచితే యేపని సేయఁగ రాదు
యేడ నైనా యెగ్గు సిగ్గు లెంచేరా భూమిని

చ. 1: వనిత చెప్పితే జాలు వారి దైనా నీఁదేవు
అనువుగాఁ గొండ మోవు మన్నా మోఁచేవు
తనివోక బూ మెల్లాఁ దవ్వు మన్నాఁ దవ్వేవు
వొనర బహురూపాన నుండు మన్నా నుండేవు

చ. 2: ఇంతి చెప్పితేఁ జాలు యెంతైనాఁ గొంచెపడేవు
అంతలోఁ బగరఁ జంపు మన్నాఁ జంపేవు
చెంత నాపె తపములు సేయు మన్నాఁ జేసేవు
కాంత దనపసులనుఁ గావు మన్నాఁ గాసేవు

చ. 3: అతివ చూచి కల్ల లాడు మన్నా నాడేవు
బతిమిఁ బారాడు మన్నాఁ బారాడేవు
పతి వైన కోసువానిపల్లె శ్రీవెంకటనాథ
గతియై కూ డుండు మన్నాఁ గాఁగిట నుండేవు.

చి.శృం.రేకు: 13-5 కేదారగౌళ సం: 10-076

పల్లవి: నేనె యనంగ నేల నీమనసూ నెరఁగదా
ఆనవెట్టి చెప్పేఁ జుమ్మీ ఆసగింతు నీకు

చ. 1: చిగిరించె కోపమున జేఁదై నవలపు
తెగనట్టి తమకానఁ దీపాయరా
వొగరుఁగాకలచేత నుడికేటి దేహము
సగము మొగమోటానఁ జల్ల నాయరా

చ. 2: చిమ్మిరేఁగె జగడాల జీఁక టైనమోహము
దిమ్మరియెడమాఁటలఁ దేటవారెరా
సమ్మతిగా నీ వొట్ల సైంచనిపొందుల
యెమ్మెల కోరికలచే నితవాయరా

చ. 3: చెదరని రేసులఁ జిన్న బోయె మోములు
కదిసి మేను సోఁకితేఁ గళ రేఁగెరా
వెదకి నీవు నేనూ శ్రీవెంకటనాథ కూడఁగా
మదిలోని మచ్చికలు మక్కళించెరా

చి.శృం.రేకు: 13-6 శుద్ధదేశి సం: 10-077

పల్లవి: కొండవంటిదొరవు నీగుణ మేల విడిచేవు
వుండరాదా నీ వుండేవొడికానను

చ. 1: కడుఁ దగవు చెప్పేవు కట్టెకానికలు వెట్టి
అడిగితిమా నిన్ను నయ్యా నేఁడు
బడి బడి నీవు చెప్తే పండితనాయానకు
తొడిఁబడ నెవ్వతైనా తుచ్చ మాడకుండునా

చ. 2: వెట్టిసాకిరి చెప్పేవు విత్తూఁ దిమ్మిరి వేసి
నెట్టెనఁ గరి గోరేమా నేఁడు నిన్నును
బెట్టిమాఁట లాడి నీవు పిరిదూరి రాఁగాను
గుట్టుచెడ నెవ్వతైనాఁ గోపగించకుండునా

చ. 3: నీతులు చెప్ప వచ్చేవు నినుఁ బెద్దతన మిచ్చి
ఆతల నడిగితిమా అప్పటినిన్ను
కాతరాన నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
ఘాత రతిలోపల నాకాలు దాఁకకుండునా.

చి.శృం.రేకు: 14-1 దేసాళం సం: 10-078

పల్లవి: ఒక్కరి నౌ నన నేల వొకరిఁ గా దన నేల
చెక్కు నొక్కి ప్రియములే చెప్పించుకో రాదా

చ. 1: మేలురా నాతో నీవు మితిమీరి మాఁటాడేవు
ఔలే నాతోడి వాదు కాపో నీవో
యేలరా నీపాలిటికి నిద్దరము సమమే
మేల మాడి సారె సారె మెప్పించుకో రాదా

చ. 2: ఇప్పుడు నీవె వాసు లెక్కించుక వచ్చేవు
అప్పటి నాతోడి సవ తాపో నీవో
అప్పసమై యిద్దరము నాండ్ల మింతే నీకు
ముప్పిరి దేవరవలె మొక్కించుకో రాదా

చ. 3: కన్నుల జంకెనలతో గరిసించి యడిగేవు
అన్ని వొట్లకు గురి యాపో నీవో
నన్ను నిట్టె శ్రీవెంకటనాథుఁడ నీవె కూడితి
వెన్నఁడూ నిద్దరి నిట్టె యేలుకొన రాదా

చి.శృం.రేకు: 14-2 ముఖారి-ఏకతాళి సం: 10-079

పల్లవి: తేటతెల్ల మిమాఁటలఁ దెలియ నాడఁ గదరా
మాటి మాటి కింత యేల మరఁగు లాడేవు

చ. 1: కన్నుల నవ్వుల నేల గయ్యాళించేవు నేము
నిన్ను వంటి వొరపులే నేరుతుమా
సన్నలా చాయలా నేల సాధించేవు వో
వెన్నుఁడా నే మింతేసి వెర వెఱుఁగుదుమా

చ. 2: తక్కరిమాఁటల జాణతన మాడేవు నేము
చక్కఁగా నీవలె నంత చదివితిమా
మిక్కిలి వాఁడిగోళ్లు మీఁదఁ జిమ్మేవు నేము
కక్కసపు జేఁతలకు కరఁగ నేరుతుమా

చ. 3: నిబ్బరపు గాఁగిటను నించే వేమిరా నేము
అబ్బురంపు నిన్ను నోఁ గా దనఁ గలమా
గబ్బివై కూడితి శ్రీవెంకటనాథుఁడా నేము
వొబ్బిడి నింత సేసితే వొద్దనఁగఁ గలమా

 చి.శృం.రేకు: 14-3 మాళవిగౌళ సం: 10-080

పల్లవి: బెల్లపుమాఁటల చెల్లపిళ్ల రాయఁడా నీకు
జెల్లునయ్య యేమైన చెల్లపిళ్ల రాయఁడా

చ. 1: పేలరిమాఁట లాడేవు పెద్దతనమా యిది
పీలిచుంగుతోడి చెల్లపిళ్ల రాయఁడా
కాలు దాఁకించినప్పుడె కళ లంటె నిఁక నేల
చేలకొంగు వట్టే వు చెల్లపిళ్ల రాయఁడా

చ. 2: యీతల నాకుఁ బరచే వింతటి దొరవు నీ
పీతాంబరము చెల్లపిళ్లరాయఁడా
ఘాతల నీగోరు దాఁకి కరఁగితి నిఁక నే నీ
చేతిలోని దాన నింతె చెల్లపిళ్లరాయఁడా

చ. 3: నెట్టన దేవరవంటి నీమేనిసొమ్ము నాకుఁ
బెట్టేవుగా చెల్లపిళ్లరాయఁడా
గట్టిగా నన్ను శ్రీవెంకటనాథుఁడ వై కూడి
చిట్టెకాలు సేసేవు చెల్లపిళ్లరాయడా.

చి.శృం.రేకు:	14-4	కన్నడబంగాళం	సం:	10-081

పల్లవి:	బాలుఁడు సేసెటి పనులా
వోల వేయవచ్చీ నోయమ్మా

చ. 1:	చన్నులపైఁ జెయి చాఁచీనే యివి
చిన్నవాండ్ల చేఁతలా
కన్నులు గిరిపీ గామి డై
వున్నాఁ డిప్పుడు వోయమ్మా

చ. 2:	పస నీమోవిపైఁ బల్లు సోఁకించీ
పసిబిడ్డలబాగులా
కొసరుమాఁటల గో రంటి విడె
మొసఁగీ నిప్పుడె కోయమ్మా

చ. 3:	నిండారఁ గాఁగిట నించీనే యివి
కొండుకబిడ్డలగుణములా
వెండిఁ బైఁడీ నిచ్చి శ్రీవెంకటనాథుఁడు
వుం డుండి ననుఁ గూడె నోయమ్మా

చి.శృం.రేకు: 14-5 నాదరామక్రియ సం: 10-082

పల్లవి: రారా చిన్నన్నా రా రోరి చిన్నవాఁడ
రార ముద్దులాఁడ రా రోరి బాలకృష్ణ

చ. 1: కిందిచూపుల గిలిగించి ఆల
మంద గొల్లెతల మరిగించి
సందడి వలపించి జవరాండ్ల వూర
వింద వైనయట్టి వేడుకకాఁడ

చ. 2: కొదలుమాఁటలనె గొణఁగుచు భూమి
సుదతుల శిగ్గులు చూరాడి
చిదుగుచేఁతలనె చెనకుచు ముద్దుఁ
బెదవిచవులు చూపిన జాణకాఁడ

చ. 3: కలికితనముననె కరఁగించి కాచె
చెలుల కాఁగిటనె చెలఁగి
లలనామణి యైన లకిమమ్మఁ
గలసుక శ్రీవెంకటనాథుఁడైనవాఁడ

ఛి.శృం.రేకు: 14-6 కాంబోదిసం: 10-083

పల్లవి: మచ్చికఁ బందిలి వెట్టే మాయకాఁడ
కుచ్చితపు వేరుపుల కుశీలికాఁడ

చ. 1: పలుకునయమె కాని పస లేదు నేస్తము
వలపులబేరాల వన్నెకాఁడ
మొలకనవ్వులె కాని మోహ మెరఁగ రాదు
నిలువు రాజసముల నీటుకాఁడ

చ. 2: దవ్వులపొందె కాని దగ్గరఁగ నెడ లేదు
జవ్వనపుమదముల జాణకాఁడ
పువ్వులవాట్లె కాని పొరపొచ్చము మానవు
రవ్వలసరముల రాయడికాఁడ

చ. 3: తమకపుఁ జూపె కాని తలఁపు దెలియ నీవు
అమరినరతులలో ఆసోదకాఁడ
క్రమమున నన్ను శ్రీవెంకటనాథ నీవె కూడి
భ్రమయించి తౌర వోరి పంతగాఁడా

చి.శృం.రేకు: 15-1 లలిత సం: 10-084

పల్లవి: చాలా మేలుదిరా యీబాలామణిపుడు నీ
పాలిటఁ జిక్కెరా గోపాలక కృష్ణమ్మా

చ. 1: పంకాజముఖి నీవంకా చూచి నప్పుడే
పొంకాముగా వలచె యింకా నే మందురా
సంకె లేక నీమీఁద నంకిత మైనపాట
లంకించి పాడీ నీతో లంకెలఁ గృష్ణమ్మా

చ. 2: పల్లాదమున నీవు మొల్లామి నందరిలో
మొల్లాపూబంతి వేయ జల్లూనఁ గరఁగెరా
మెల్లానె వ్రాసి చూచీఁ జల్లాఁగ నీ రూపమె
కల్లా గాదురా శ్రీవల్లభ కృష్ణమ్మా

చ. 3: తటుకానా నీ వప్పుడు నటనాలా సరసాన
యిటు నటుఁ గాగిలించ నెట్లాఁ దా జొక్కెరా
విటరాయఁడవు శ్రీవెంకటనాథ నీ కూటమి
ఘటియించ వేడుక మిక్కుట మాయఁగృష్ణమ్మా

చి.శృం.రేకు: 15-2 దేసాళం సం: 10-085

పల్లవి: ఎన్నఁడయ్యా నీ నేరుపు లిప్పుడు గాక
ము న్నిటిపొం దై నవారి ముందరనె కాక

చ. 1: వాడలోన నీమోమె వనితలు చూడఁగాను
యీడనె సేయవద్దా నీ యెమ్మెలు
చేడె లెల్లా నీ మాఁటలె చెవి యొగ్గి వినఁగాను
ఆడవద్దా నీకు దోఁచి న ట్టెల్లాను

చ. 2: సతు లెల్లా మూఁకగట్టి సంగడి నిలుచుండఁగా
సతమై కరఁగ వద్దా సారెకు నీవు
అతివలె చెయి ముట్టి అంటి సరస మాడఁగ
మతిలోనఁ జొక్కవద్దా మాముందర నీవు

చ. 3: సందడిలో నింతు లెల్లా చన్నుల నిన్నొరయఁగా
కందువ లంటఁగ వద్దా గబ్బి వై నీవు
యిందె శ్రీవెంకటనాథ యేకతమై వుండఁగాను
అందముగా నన్నుఁ గూడి తవునయ్యా నీవు

 చి.శృం.రేకు: 15-3 ఆహిరి సం: 10-086

పల్లవి: అయ్యో దయ వలదా ఆఁటదానికి
చయ్యాట మాడినాను సంగతి గావలదా

చ. 1: జీరల నీ మేను చూచి సిగ్గయ్యీ నా కైతె
ఆరడి నీ కె ట్లితవాయనో కాని
కూరిమితో నాపెకు నీ కుందణమువంటి మేను
యీరీతిఁ జేయఁగఁ జేతు లెట్లాడెనో

చ. 2: గంటైన నీ మోవి చూచి కనికిర మయ్యీని
కంటకము నీ కెట్లా గాదో గాని
గొంటరియాపె దానె చిగురువంటి నీ మోవి
అంటి యింత సేసె నెంత అగ్గలికో కాని

చ. 3: కురులు నలఁగిన నీ కొప్పు చూచి వెరగయ్యీ
శిరసు నీ కె ట్టోరిచెనో కాని
గరిమఁ గూడితి శ్రీవెంకటనాథ నను నిటె
నిరతిఁ గడపరాయ నిను మించఁ గలనా.

చి.శృం.రేకు: 15-4 హిందోళం సం: 10-087

పల్లవి: పాలు దాగె వెన్న దినె బానల పెరుగు జుట్టె
సోలి కాఁగులనేతులు చూరలాడె నమ్మా

చ. 1: చిన్నవాని ఆరడి సేసినట్లు వుండుఁ గాని
యెన్నెన్నిపోకిళ్లఁ బోయ్యీ యీకృష్ణుఁడు
కన్నెలు ముద్దాడఁ బోతే గంటి సేసి మోవు లెల్ల
తన్నుఁ గానట్టున్నాఁడు దయ్యపువాడమ్మా

చ. 2: తగినపసిబిడ్డనిఁ దతిగొన్న ట్టుండుఁ గాని
యెగసక్కే లెన్ని నేర్చె యీగోవిందుడు
మగువ లెత్తుకొంటేను మరి గోళ్లువెట్టి తానె
తగవులు చెప్పెఁ గతలకారోయమ్మా

చ. 3: పలుదూరులు బాలునిపైఁ జెప్పినట్టుండుఁ గాని
కలికివాఁడమ్మ శ్రీవెంకటనాథుఁడు
చెలులు కాఁగిలించితే సిగ్గు వీడఁ గూడి కూడి
వలపించినాడు యెటువంటివా డోయమ్మా

చి.శృం.రేకు: 15-5 పాడి సం: 10-088

పల్లవి: అంతేపో నాతోడ నౌఁ గా దనఁ గ రాదు
పంతమాడి గెలిచితే బంట వయ్యేవా

చ. 1: కానీ లేరా పొడుపుడుఁగతలు వొడువు మని
ఆనవెట్టి న న్నేల అడ్డగించేవు
పూని నా కతలు నీకుఁ బొందుగాఁదెలియకుంటే
పానిపట్టి నీవె నా బంట వయ్యేవా

చ. 2: చలపటి నాతోడ సరిబేసు లాడు మని
బలిమి నాకొం గేల పట్టి తీసేవు
వొలిసి ని న్నిప్పుడె వొడించితే నాతోడఁ
బలుమాఁట లేల నాబంట వయ్యేవా

చ. 3: నీవు దలఁచిన సుద్ది నిక్కి నన్నుఁ జెప్పుమని
కావించి మండెమురాయ కాఁగిలించేవు
శ్రీవెంకటనాథుఁడవె చెలఁగి నీ వనుచు నీ
భావ మెరిఁగి కూడితి బంట వయ్యేవా.

చి.శృం.రేకు: 15-6 ముఖారి సం: 10-089

పల్లవి: ఇది యేమె వీనిగుణ మొటువంటిదే
వదలక నవ్వ నూరవదినెనా నేను

చ. 1: చక్కనివాఁ డైతేఁ దానె చల్లఁగా నుండుఁ గాక
యిక్కడ నెవ్వరి భ్రమయించ వచ్చినె
వక్కణలమాఁటలకు వలచి వెంటఁ దిరుగ
తక్కరి రేపల్లె గొల్లదాననా యేమి

చ. 2: పాయపువాఁ డైతేను బదుక నీవె యిట్టె
కాయక మై యెవ్వరిపైఁ గన్ను లార్చీనె
సోయగ మై తనమోము చూచి నట్టె మోహించి
పాయకుండ మేనవారిపడుచనా నేను

చ. 3: నేరుపది దా నైతె నెమ్మది నుండుఁ గాక
కేరి కేరి యెవ్వరిపై గేలు చాఁచీనె
చేర వచ్చి నెల్లూరి శ్రీవెంకటనాథుఁ డిట్టె
యీరీతినె ననుఁ గడె యిందిరనా నేను.

చి.శృం.రేకు: 16-1 శ్రీరాగం సం: 10-090

పల్లవి: వల పేమి గంపఁ గమ్మవచ్చునా యెందైన
చెలులాల మాయిద్దరి చిత్తములే యెరుఁగు

చ. 1: యెనయని కోపమున యేమైనా నంటిఁ గాక
మనసులో మమతలు మానఁ గలనా
ఘనమైన పొలయలుకలఁ గొసరితిఁ గాక
వినరమ్మ రమణుని విడనాడఁ గలనా

చ. 2: ఆలసించి రాఁగానె అన్నియుఁ దిటితిఁ గాక
మేలుదాన వానిఁ బాసి మించఁ గలనా
ఆలరి యై తిరుగఁగ నమ్మరో దూరితిఁ గాక
బాలకి నైన వానిఁ బాసి వుండఁ గలనా

చ. 3: దగ్గరని కాఁతాళాన తగుఁ దగ దంటిఁ గాక
యెగ్గువట్టి వానితప్పులెంచఁ గలనా
కగ్గు లేక శ్రీవెంకటనాథుఁడె నన్ను
అగ్గల మై కూడె వానియండ వాయఁ గలనా.

చి.శృం.రేకు: 16-2 వరాళి సం: 10-091

పల్లవి: ఎటువంటి దొర వైతి వేమయ్య నీవు
అటమటముల నీకు నాచార మేది

చ. 1: వెనక నా యడపమువెలఁది మో వానితివి
అనువుగ నేఁ గంటి నద్దములోన
తనియక నాకు నిట్టె తమ్ముల మిడ వచ్చేవు
యెనసి వూడిగపుదానెంగిలి కోపుదునా

చ. 2: ముచ్చట నా కాళాంజిముదితఁ గాఁగిలించితి
వచ్చుగా నే రత్నపుగోడావలఁ గంటి
యిచ్చకాన నామీఁద నిట్టె చెయి వేసేవు
చెచ్చెర సేవకురాలిచెమట కోపుదునా

చ. 3: వొద్దనె నా కుంచదాని నొగిఁ దోఁటలోఁ గూడఁగా
నిద్దపుఁ గేళారూళి నీటిలోఁ గంటి
గద్దరివై నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
అద్దో పరిచారకురాలంటుకు నోపుదునా.

చి.శృం.రేకు: 16-3 పాడి సం: 10-092

పల్లవి: సుసరాన మంచి దాయ సుదతులాల
విసుగక పతిఁ దేస్తే వెద లేమి లేవే

చ. 1: తమ్మితూఁడు లాళమునఁ దగిన కస్తూరివుంట
వుమ్మడినె మదనుఁడు వూఁదఁగను
కొమ్మ చనుజక్కవల గొబ్బున నెగయఁగాను
కమ్మి పతిపె పయ్యద గలుగఁగ నిల్చెనే

చ. 2: మొగలిరే కొడిశంట ముదురుఁగ ప్రపులప్ప
వెగటున మదనుఁడు వేయఁగను
అగడై యింతి నడపుటంచలు బెదరఁగాను
వొగిఁ బాదపుపెండెము లోపికె నిలిపెనే

చ. 3: చెఱకుఁదూఁట సింగిణి చెంగలువ మిట్టకోల
వెఱవక మదనుఁడు వేయఁగను
పఱచికురులతేంట్లు పారఁగా నడ్డ మై కాంతఁ
గఱఁగించి కూడీ శ్రీవెంకటనాథుఁ డాఁపెనే

చి.శృం.రేకు: 16-4 శుద్ధదేశి సం: 10-093

పల్లవి: కన్నెపడుచుతో నేమి గయ్యాళించేవు
అన్నిటా మచ్చికైతె నిన్నాపె మించ నోపదా

చ. 1: దివ్వెకు మానెవోనె పతిమఁ జూచి ముద్దరాలు
యెవ్వతో వున్న దని యిదె కొంకీని
నవ్వు లేమి నవ్వేవు నాలికాఁడ చెయివట్టి
జవ్వనిఁ దియ్యరాదా చలివాయను

చ. 2: పొదిగి పాదాలు గుద్దే బొమ్మఁ జూచి గోలయై
అదెవ్వతో వున్న దని అండు కాచీని
యిదేమి వేడుక చూచే వెమ్మె కాఁడ కొంగువట్టి
కదియఁ దియ్యఁగ రాదా కళ రేఁగను

చ. 3: చేయంటి సురటి వీచే చేఁతాళపు రూప్ప చూచి
పాయని దెవ్వతో యని బాల లోఁగీని
కాయజకేలిని శ్రీవెంకటనాథ కూడితివి
ఆయెడ న న్నింద నిల్పి యతి మోదమునను.

చి.శృం.రేకు: 16-5 భైరవి సం: 10-094

పల్లవి: ఎంతనేరుపరివి ని న్నే మందమే
పంత మాడె యాపె నింత భ్రమయించెఁ జూడరే

చ. 1: చలపాదియాపె నా సంగడినె వుండఁగాను
వెలఁది రమణుఁ డొక్కవిధము సేసె
అల చుక్కల నెంచవె యని దాని నేమరించి
కళ లంటి నను బిగ్గెఁ గాఁగిలించెనే

చ. 2: మొక్కళాన యాపె నాతో మొనసి సాటికిరాఁగా
చక్కనిరమణు డొక్కజాడ సేసెనే
అక్కడ దాగిలిముచ్చు లాడి దాని గన్నుమూసి
దక్కి నామో వాని నాకుఁ దమ్ములము వెట్టెనే

చ. 3: బట్టె గుత్తె యాపె నేఁడు పాయక వద్ద నుండఁగా
యిట్టె శ్రీవెంకటనాథుఁ డిటు సేసెనే
గట్టిగా నాపె కన్నులఁ గప్రమునిండాఁబెట్టి
జట్టిగా నాతోఁ గూడి సమరతి సేసెనే.

చి.శృం.రేకు: 16-6 నాదరామక్రియ సం: 10-095

పల్లవి: ఎత్తూ నొరాఁ గల దిటువంటిది వలపు
యిత్తరి గాఁకల వన్న యించుకాఁ దియ్యదు

చ. 1: మచ్చికతోడుతఁ దూఁగు మంచపుఁ దాసుమీఁద
నిచ్చ నిండ జవ్వనపు నీవొక్కచో
నిచ్చలపు గుణముల నే నొక్కచో నుండఁగాను
అచ్చముగా సరిఁ దూఁచె నతనుఁడే యిపుడు

చ. 2: మించి చలువరాయనే మెచ్చుల వొరగంటిపై
నించినట్టి వేడుకల నీదేహము
దించని తమకపు నాదేహమూఁ బెనఁగఁగా
పొంచి సరిగా నొరసె పూవిలుతుఁ డిపుడు

చ. 3: కలసె పూఁబానుపు మొగ్గల గొప్పసళాకలు
నిలువున శ్రీవెంకటనాథ నీరతికి
కొలఁది మీరఁగ నేఁ గడిన సమరతికి
వలె నని వనె వెట్టీ వలరాయఁడిపుడు

 చి.శృం.రేకు: 17-1 దేసాళం సం: 10-096

పల్లవి: సిగ్గువడ నేమిటికి చెలువమె యిది నీకు
యెగ్గు లేదు యిట్టె సింగారించుకొనవయ్యా

చ. 1: కపురపు బలుకుల కంటసరులు నీకు
యిపు డిట్టె చెలి యంపె నిందవయ్యా
చపలపు నీమెడ చంద్రవంకల మీఁద
కపురై వుండు నిట్టె కట్టుకొనవయ్యా

చ. 2: నెలకొన్నకస్తూరి నిగరపుఁ బోఁగులు
కలికి నీకు నంపెఁ గైకొనవయ్యా
యెలమిని మేదించినితరవాసనఁ గప్పి
పెలుచ వందురు యిట్టె పెట్టుకొనవయ్యా

చ. 3: కోవరపుఁ బచ్చికుంకుమపూవుదండ లంపె
శ్రీవెంకటనాథ యింతిఁ జేకొనవయ్యా
తోవల నీమై నంటిన తొలుతటి పస పెల్లా
వేవేగ నిది గప్పి వేసుకొనవయ్యా

చి.శృం.రేకు: 17-2 ముఖారి సం: 10-097

పల్లవి: దానిసాహసము మేలు తరవాత నీవు మేలు
పూనిన యారడికి ని న్నొడి గట్టించినది

చ. 1: రవ్వగా మే నెల్లా జీరలుగాఁ జేయించుక
మవ్వపు నాయెదుట నీవు మలసేవు
నవ్వుల కైనాను నామాఁట మీరనినిన్ను
యెవ్వతెరా నిన్ను నింతగాఁ జేసినది

చ. 2: చిగురు నీమోవి యెల్లా చిల్లులుగాఁ జేయించుక
వెగటుగా నాయెదుట విఱ్ఱవీఁగేవు
తగవుల కైనా జివగాఁటని నిన్నుఁ దెచ్చి
జగ నీపై యింత సేసి చలి వాపెను

చ. 3: చేవ దేర నీతురుము చిక్కువడఁ జేయించుక
శ్రీవెంకటనాథ కడుఁ జెలఁగేవు
యేవేళ నన్నుఁబాయక యెనసి వుండితినిన్ను
యీవేళఁ జెనకుచు యెమ్మెలు సేసినది

చి.శృం.రేకు: 17-3 సాళంగనాట సం: 10-098

పల్లవి: ఔనయ్యా మే లెరిఁగిన ఆణికాఁడవు
తానక మైన నీ దొరతన మెల్లాఁ గంటిమి

చ. 1: జక్కఁదన మెరఁగనిజాణవా నీ వేమైనా
తక్కరి వై గుజ్జుదానిఁ దగిలితివి
యెక్కువగా నాముందర యెవ్వరినో యెంచఁగాను
చక్కఁగా నామదిలోన చల్లఁ గాక వుండునా

చ. 2: కన్నెపాయ మెరఁగని ఘనుఁడవా నీ వేమి
పిన్న వై రేవతిదేవిఁ బెండ్లాడితివి
యెన్నికె నాముందర నీయింతులజవ్వనమెంచె
తన్నిటా నామదిలోన నానందించ కుందునా

చ. 3: యిట్టె వినయము నీ వెరఁగవా నీ రొమ్ము
మెట్టినయింతికె కడు మేలువాఁడవు
చిట్టకము లెంచేటి శ్రీవెంకటనాథ నన్ను
గటిగాఁ గూడితివి నేఁ గరఁగక వుందునా.

చి.శృం.రేకు: 17-4 సామంతం సం: 10-099

పల్లవి: ఇచ్చకమె సేసే వేరా నీవు
యెచ్చోటి చనవరి వేరా నీవు

చ. 1: మన్నించి నన్ను నిట్టె మరఁదల రమ్మనేవు
యెన్నటి మేనవాఁడ వేరా నీవు
వెన్నుఁడ నన్ను నిట్టె విడెము దెమ్మనేవు
యెన్ని దాఁచఁ బెట్టితివి యేరా నీవు

చ. 2: మెప్పించి నాతోడ మేలము లాడేవు
యెప్పటి నేస్తకాఁడ వేరా నీవు
దుప్పటికొంగు నాపై దొడిఁబడఁ గుప్పేవు
యిప్పు డెన్నటిపొందు యేరా నీవు

చ. 3: కానిరా నను నిట్టె కాఁగిలించుకొనేవు
యేనాటి చుట్టమవు యేరా నీవు
కానిపించి నన్ను శ్రీవెంకటనాథ కూడితివి
యేనెలవున నేలితి వేరా నీవూ.

చి.శృం.రేకు: 17-5 బౌళి-వర్మతాళం సం: 10-100

పల్లవి: ఇంక నేలా నాతోడ యింత సేయ
అంకెకొఁడ వౌర శేషాద్రినాథా

చ. 1: చల్ల లమ్మేవారి కేల చందనము
చెల్లు నీవె పూసుకోరా చిన్నవాఁడ
కల్లరివై నాతో నేల గయ్యాళించ
మల్లాడ నీ వదినెనో మరఁదలనో

చ. 2: జట్టిగా గొల్లెతల కేల చంద్రగావి
గట్టి గాఁగా నీవె దట్టి గట్టుకోరా
గట్టువాతనమునఁ గదిసి నన్ను
పట్టేవు నీ చుట్టెమనో పక్కమనో

చ. 3: మందలోనివారి కేల మల్లెలు
ముందు నీవె కొప్పులోన ముడుచుకోరా
అంది శ్రీవెంకటనాథ అవురా నన్ను
అందముగాఁ గూడితివి ఆల నటరా

చి.శృం.రేకు: 17-6 బౌళిరామక్రియ సం: 10-101

పల్లవి: గుజ్జనఁగూడు వండెనె కోమలి నేఁడు
గొజ్జువెన్నెలబాయిటఁ గొమ్మలుఁ దాను

చ. 1: గోమున సేవంతిపవ్వు గురుగులలోపల
యేమరక పూఁదేనె నెసరు వెట్టి
ప్రేమతోఁ బచ్చక ప్రపుబియ్యము కొద్దికిఁ బోసి
దోమటిగా మంచి పూవుఁదోఁటవెంట వాలెను

చ. 2: మచ్చికఁ బన్నీటను మారెసరుగాఁ బోసి
కచ్చు పెట్టి మల్లెమొగ్గఁ గలయఁ బెట్టి
మెచ్చుల మరువమున మించినట్టి పాం గణఁచి
ముచ్చటఁ బచ్చాకున మూఁకుడు మూసి

చ. 3: చెలఁగి వట్టివేళ్ల జిబిలికెను వారిచి
కులికి పుప్పొళ్లనే కూరలు వండి
కలికి చుట్టెపు శ్రీవెంకటనాథురతిఁ గూడె
వెలయ నాతనికి విందు వెట్టెనూ

చి.శృం.రేకు: 18-1 రామక్రియ – అటతాళం సం: 10-102

పల్లవి: తలఁపు దలఁపు లెస్స తగు లాయను
కలకంటి యిందుకె నిక్కము వలచెనయ్యా

చ. 1: యేనుగపై నీవు రాఁగా యింతి పయ్యద జారఁగ
పూని మిద్దెమీఁద నుండి పొసఁగఁ జూచె
ఆని కరికుంభములు అంకుశాన నీ వూఁదిన
కానుక నీ చేఁతలకు గడు వలచెనయ్యా

చ. 2: నీవు గుఱ్ఱముఁ దోలఁగ నెలఁత చిక్కు దీయుచు
తావుల మేడపై నుండి తప్పక చూచె
కావించి నీ సమకట్లలో నల్ల జల్లి
దూవిన నేరుపుల కెదురు వలచెనయ్యా

చ. 3: తేరుపై నీ వెక్కి రాఁగా తెఱవ మై పులకించి
చేరువ వుప్పరి గెప్పెఁ జెలఁగి చచె
గారవించి వచ్చి శ్రీవెంకటనాథ నీవు గూడ
తారుకాణ చేఁతలకు దగ వలచెనయ్యా

చి.శృం.రేకు: 18-2 బౌళి సం: 10-103

పల్లవి: అటువంటివారికి నీ వప్పుడే వలతువు
అటు నిటు నిన్నుఁ బా లార్చీనా యేమి

చ. 1: గుట్టున మొగలిరేకు కొమ్మపయ్యదపై వేయఁ
బుట్టెచెండు వుచ్చుకొని పొలిఁతి వేసె
అట్టె నీ చేఁతకుఁ జేఁత ఆపె సేసె నావలెనె
దట్టించక నీపై దయ దలఁచీనా యేమి

చ. 2: మెత్తని తామెరపువ్వు మెలుతపై నీవు వేయ
బొత్తుగా బాదపుటందెఁ బొలిఁతి వేసె
మత్తిలి యాపె మారుకు మారు సేసె నావలెనె
బత్తి సేసి ని న్నూరకె పాటించీనా యేమి

చ. 3: యించుక దగ్గరి నీ వేకతము చెప్పఁబోతే
లంచముగా నీకుఁ దమ్ములము వెట్టెను
నించి శ్రీవెంకటనాథ నిన్నుఁగూడె నావలెనె
మంచితనమునఁ గూడి మన్నించీనా యేమి

ఛి.శృం.రేకు: 18-3 సామంతం సం: 10-104

పల్లవి: మందుల మాయల బోదె మంచివలపు
బొందితోఁ బతికాఁగిట భోగింపించుఁ గాని

చ. 1: కారుచిచ్చయినాఁ దొలుకరివానచే నారు
ఆరదు పన్నీటిజడి నంగతాపము
ఆరడై నీటిచేత ననల మారకుండునా
సారెఁ జెలి కోరిక వెచ్చలు రేఁచెఁ గాక

చ. 2: జడివానైనా వెలుచు సంగడి చలికాలాన
యెడయదు చలువల నింతి చెమట
నిడివిఁ బుప్పొడి చల్ల నీరు దియ్యకుండునా
కడుఁ జెలియ మనసు కరఁగించీఁ గాకా

చ. 3: వేవేగ నాయిటివోతె విసరదు బెట్టుగాలి
పోవు నిట్టూర్పులు పతిఁ బొందినా నీవె
శ్రీవెంకటనాథుఁ గూడి చెల్లునటె పుసురన
భావజకేలిలోపలి పరిణత గాకా

చి.శృం.రేకు: 18-4 వరాళి సం: 10-105

పల్లవి: వెలిపించితిగా వోయి వేడుకకాఁడ
తెలివ నీ మాఁట విని దిందుపడెఁ గాని

చ. 1: పొలిఁతి నీమోముచూచి పున్నమచందురుఁడని
వెల వెలఁ బారి చాలా వెరచెనయ్యా
వలచి నీతామెరలవంటి కన్నుల జూడఁగా
కలఁకదేరి మరి కనువిచ్చి చూచెను

చ. 2: కొమ్మ నీకురులు చచి గుంపుఁదుమ్మిదలనుచు
వుమ్మలూర మదిలోన నులికెనయ్యా
పమ్మిన పీలిపించపుపాగ చూచి నీ వనుచు
దిమ్ము విడిచి వొయ్యనె తెప్పిరిలె నిపుడు

చ. 3: నల్లఁగలువ చేఁబట్టి నయముతో నీవు రాఁగా
పల్లదపు మరుఁడని భామ లోఁగెను
వెల్లవిరై కాఁగిట శ్రీవెంకటనాథ యింతిని
చల్లఁగా నీవు గూడఁగ సమరతి సేసెను.

చి.శృం.రేకు: 18-5 కేదారగౌళ సం: 10-106

పల్లవి: నిండుదొర వౌదు నీగుణము వేలు నిన్ను నమ్మవలెఁబో
పండినమామిడిపై చిలుకవలె పచ్చి దేర నేలతిరిగేవయ్యా

చ. 1: వనిత కొండంత వలపుతో నీ వరుసఁకు గాచుకుండఁగా
చినుకు జీఁకటి పొద్దున నీ వేడ చెలితో నవ్వేవయ్యా
మనసార నీవె నిప్పువంటిబాస మగువకు నిచ్చి వచ్చితి
అనుగు నామనికోవిలవలె నాడా నీదా నేల తిరిగేవయ్యా

చ. 2: యింతి సముద్రమువంటి తమకాన యెదురెదురె చూడఁగా
యింతలోఁ గాఁదారి మాఁదారి పొద్దుననెవ్వతెఁజూచేవయ్యా
వంతదీరఁ దాఁచుఁబాముపంటి దేవరమీంద నానవెట్టితి
వంతుకు నీ విట్టె జుంటియీఁగవలె వాడ వాడ నేల తిరిగేవయ్యా

చ. 3: చెలి చుక్క లన్ని కోరికలతోడ చిత్తము నీ కిచ్చుకుండఁగా
పొలసి ముచ్చిమి పొద్దున నెడపూఁబోఁడిఁ బిలిచేవయ్యా
కలికి శ్రీవెంకటనాథ నీవె గారవించి సతిఁ గూడితి
కొలఁకుల నీఁదేరాయంచవలె కోడెకాఁడ యేలతిరిగేవయ్యా

చి.శృం.రేకు: 18-6 మాళవిగౌళ సం: 10-107

పల్లవి: నీ వెక్కుడో ఆపె నీకంటె నెక్కుడో
రావయ్య తిరుపతి రఘురామచంద్ర

చ. 1: తుమురుగ దనుజులఁ దోలి తొప్పర లాడి
అమరఁగ గెలిచితి నందుపు
మమతతోడుత నిన్ను మదనయుద్ధమునందు
రమణి నిన్ను గెలిచె రఘురామచంద్ర

చ. 2: తవిలి శివుఁడు కాశి దారకబ్రహ్మ మని
యివల నిన్నుపదేశ మియ్యగా
నవ మై శ్రీవెంకటనాథ మరుతంత్రము
రవళి నీ కీపె యిచ్చె రఘురామచంద్రా.

ఛి.శృం.రేకు: 19-1 దేసాళం సం: 10-108

పల్లవి: ఏమి మందు గద్దె యింతు లాల యీ
రామకుఁ దిరుపతి రాముడే మందు

చ. 1: వెలసెటి విరహన వేఁగెటియింతికి
చెలియలాల యేమి సేతమే
చలివేఁడివలపుల చవి గన్న యీపెకు
వలపించిన తనవరుఁడే మందు

చ. 2: పొదిగొన్న తమకానఁ బొరలెటి కాంతకు
చెదరక మన మేమి సేతమే
పుదుటుఁ గోరికల నొనరెటి యీపెకు
మదిలోపలి తనమగఁడే మందు

చ. 3: పొల్లవోని యాసఁ బొరలెటి మగువకు
చెల్లఁ బో మన మేమి సేతమే
కొల్లగా రతి నింతిఁ గూడినాఁడీపెకు
నల్లని శ్రీవెంకటనాథుఁడే మందు.

చి.శృం.రేకు: 19-2 నాదరామక్రియ సం: 10-109

పల్లవి: ఇన్నాళ్లు దా యేడ నుండెనమ్మ
వన్నెగాఁ గొసరవచ్చీ నేఁడు

చ. 1: వేఁకపు విరహన వేఁగ లేక నేను
సోఁకఁగ నెదురు చూడఁగా
తాఁకి తలఁచఁడు తరుణులఁ గూడి
యేఁకట నిపుడు నే నిత వైతినా

చ. 2: కడు నొంటిఁబొద్దు గడపఁగ లేక
వొడికపుటాసల నుండఁగా
తడవఁడు నన్ను దనయిచ్చలనే
అడరి యిప్పుడే నాపై ఆ వుట్టెనా

చ. 3: గొప్పతమకానఁ గుందుచుండ లేక
అప్పుడె పిలువ నంపఁగా
కప్పి నన్ను శ్రీవెంకటనాథుఁడు గూడె
యిప్పుడు నారతు లింపు వుట్టెనా.

చి.శృం.రేకు: 19-3 దేవగాంధారి సం: 10-110

పల్లవి: చల్లని చూపులవాని చక్కనివాని పీలి
చొల్లెపుఁ జుట్లవానిఁ జూపరమ్మ చెలులు

చ. 1: వాడలోని చెలులను వలపించి వచ్చెనే వాడు
చేడెల మనసు దొంగ చిన్నికృష్ణుఁడు
యేడుగడయునుఁ దానై యెలయించె నన్నును వాని
జాడక వుండఁగ లేను చూపరమ్మ చెలులు

చ. 2: మందలోని గొల్లెతల మరిగించి వచ్చెనే వాడు
సందడి పెండ్లికొడుకు జాణకృష్ణుఁడు
ముందు వెనకా నలమి మోహింపంచెనన్నును వాని
పొందులు మానఁగ లేను పోనీకురే చెలులు

చ. 3: ఇంటింటి యింతులనెల్లా యెలయించి వచ్చెనే వాడు
దంటవాఁడు కవికిచేఁతల కృష్ణుఁడు
నంటునను శ్రీవెంకటనాథుఁడై నన్ను గూడెనే వాని
వొంటిఁ బాయలే నావద్ద నుంచరమ్మ చెలులు.

చి.శృం.రేకు: 19-4 పాడి సం: 10-111

పల్లవి: బాలుఁడటవే సా దటవే వీఁడు పల్లదీఁడు గాక
కోలుముందై తనమాఁటలే గెలువ గొబ్బునఁదగవు చెప్పీనమ్మా

చ. 1: పసులఁ బేయలఁ గూరిచీనమ్మా పాలు నేయినారగించీనమ్మా
పసిబిడ్డఁ డంటా నెట్టు నమ్మవచ్చు బాలకృష్ణురాయని
కొసరి కన్నులు గీఁటీనమ్మా కొంగువ ట్టొయ్యనె తీసీనమ్మా
యిసుమంతలోనె కన్నుమొరఁగించి యిల్లిల్లు దప్పక తిరిగీనమ్మా

చ. 2: నీరాటిరేవులఁ బొంచీనమ్మా నిక్కి నిక్కి తానెచూచీనమ్మా
వేరులేక యెట్టు దగ్గరుదము గోవిందకృష్ణురాయని
ఆరడితో నొడిదొడికీనమ్మా ఆనలువెట్టుచుఁ బోనీడమ్మా
వీరిడిమాయల నిందరినిఁ దాసు వెంట వెంట నేల తిప్పీనమ్మా

చ. 3: వొంటినె కాఁగిట నించీనమ్మా వొయ్యనె కళలు రేంచీనమ్మా
నంటున మమ్మెల్లఁ గూడె శ్రీవెంకటనాథు కృష్ణరాయఁడు
జంటవలపులు చల్లీనమ్మా చలమున దక్కగొనె నోయమ్మా
బంటుగా నేలి అందరి మన్నించి పరిణామమున నున్నాఁ డమ్మా

చి.శృం.రేకు: 19-5 శ్రీరాగం సం: 10-112

పల్లవి: తామెరయాఁటదియును భువిలో దప్పులఁ బొరలఁగఁగలదా
కామించిన తన కులపురుషని కరముల నలమినఁ గాకా

చ. 1: ఇందుకళామౌళికి నతనుని కేకాలము వైరము గాదా
కందువతో బున్నమ గాఁగా గండము గడచే
ముందరనె యెనసెటిశరములమ్ముం బారముగడపఁగవసమా
అందముగా నడుములయమ్ములు అసిఁ బోయఁ గాకా

చ. 2: కమలోత్పత్తికి హిమరుతువుకుఁ గలకాలము వైరము గాదా
అమలాంబరమునుఁ గూడఁగ నాపద గడచే
అమరంగాఁ జక్రముఁ బాపిన అదియునుఁ గడవఁగవశమా
క్రమమునహంసాగమమునఁ గడతేరెఁ గాకా

చ. 3: నీలాంబుదశిఖకును గాలికి నిక్కముగా వైరము గాదా
మేలిమి మీఁదటి యోగము పేర్మినీబాదలు గడచే
ఆలించిన నదియ అపూర్వం బైననుఁ గడవఁగ వశమా
తాలిమి శ్రీవెంకటనాథుఁడు తాఁగూడఁగ బ్రతికెఁ గాకా.

చి.శృం.రేకు: 19-6 సాళంగనాట సం: 10-113

పల్లవి: జాజరవలపు జాణఁడే
వోజ దప్పఁడుగా నోయమ్మా

చ. 1: పూని పిలువఁగ నొల్లక పోయిన
మేనవాఁడ ననీ మేలే
మానలేక పోయి మళ్లివస్తి నని
ఆనవెట్టీఁ జవు లవునట్టే

చ. 2: పట్టి పెనఁగఁగ బరాకు సేసిన
చుట్టైమ ననీఁ జూడరే
నెట్టైన నాఁటికి నేడు వస్తి నని
దిట్టైమాఁట లాడీఁ దెలిసెనా

చ. 3: చెయివట్టినాఁ జేరరాకుంటే నా
ప్రియుఁడనీఁ బ్రేమతో
కయికొని శ్రీవెంకనాథుఁ డిట్టై
పయి పయి నన్నుఁ బాలించెనే.

చి.శృం.రేకు: 20-1 పాడి సం: 10-114

పల్లవి: వేళావేళలు లేవా వినోదములకై నాను
యేలా తమకించి వస్తే యిది నీ వెఱఁగవా

చ. 1: అయ్యో సారె నన్ను నలయించే వేరా
వొయ్యారపువాఁడ యింత కోపుదునా
చయ్యాటాన జాజిమొగసానఁ బట్టే వేరా
నెయ్యపు నాతలఁ పిది నీ వెఱఁగవా

చ. 2: యిటె మాఁటిమాఁటికి యేఁచే విదేమిరా
పట్టిన నీ చలాన నేఁ బడఁగలనా
వుట్టిపడి చిగురాకు వుక్కఁ బెట్టే వేరా
నెట్టైన నా వల పిది నీ వెఱఁగవా

చ. 3: చాలాఁ దరితీపుల సటలు సేసే వేరా
బాలకి నింతే నిన్నుఁ బాయ గలనా
మేలిమి దామెరలోఁ దుమ్మిద గూడినటునన్ను
యేలి శ్రీవెంకటనాథ యిది నీ వెఱఁగవా.

ఛి.శృం.రేకు: 20-2 శంకరాభరణం సం: 10-115

పల్లవి: ఒగ్గాలివాఁడు గదె వోయమ్మా
సిగ్గున నా కగపడె చిలుకచందమునా

చ. 1: తలఁచుకొంటేఁ జాలు తా నాడ కేఁగునమ్మా
వొలసి కమ్మగట్టు పావురమువలే
నెలత మదిఁ బారితే నిదురే కానఁడమ్మా
చలపాదిరా తిరిటి జక్కవచందమునా

చ. 2: ముదిత యెలుఁగు వింటే మొక్కలాన వాలునమ్మా
బెదరని పెంపుడుఁ బికిలివలే
సుదతి వుండిన యింటిచుట్టూఁ దిరుగునమ్మా
చెదరని మతితోడ జీనువవలెను

చ. 3: గోమున నో యని యంటే గొబ్బున నోయనునమ్మా
కోమలపు వసంతపు కోవిలరీతి
కామించి మమ్మును శ్రీవెంకటనాథుఁడు గూడె
రామలలోఁ బాయలేని రాయంచవలెను.

చి.శృం.రేకు: 20-3 ముఖారి సం: 10-116

పల్లవి: ఉపదేశ మిచ్చెగా వువిద మా కెల్లాను
యిపుడు నీ మన సాపె యెట్లా నెరిఁగెనో

చ. 1: కలికి నిన్నునుఁ బాదకమలానఁ బూజించె
నెలపై దేవర వని నేము మొక్కఁగా
వులివచ్చి నవ్వులతో వున్నాఁడ వందుకునీవు
మెలమి నీ మన సాపె యెటులా నెరిఁగెనో

చ. 2: తరుణి నీకు వుక్కిటితమ్ములాన విందు వెట్టె
వొర వని నేము నిన్ను దొడ్డసేయఁగా
సరసాన నీవూ నది చవి సేసు కున్నాఁడవు
యిరవై నీ మన సాపె యెటులా నెరిఁగెనో

చ. 3: మగువ నిన్ను బూతుమాఁటలు కొనియాడె
నిగిడి యేలికె వని నేము గొల్వఁగా
నగుతా శ్రీవెంకటనాథ మమ్ముఁ గూడితివి
యెగువ నీ మనసాపె యెటులా నెరిఁగెనో.

చి.శృం.రేకు: 20-4 మాళవిగౌళ సం: 10-117

పల్లవి: గాలి కూటి పేరిగట్టు మీఁదటివాఁడ
నేలసోద్యము పేరినెలఁత యె నిన్ను మెచ్చె

చ. 1: తెలిమొయిలుపేరిటి తిలకము వెట్టి
వెలయఁ బైరెడి పేరి విరులు ముడిచి
బలిమి మరుని పేరిపండు చేఁ బట్టి
జలజము పేరిటిసతి నిన్నుఁ జూచె

చ. 2: రేగాముపరిటి రెంటెము గట్టి
భోగిపేరితీగాకు పొఁసఁగ జొట్టుచును
బాగుగాఁ జుక్క పేరి యాభరణాలు వెట్టి
నాగముపేరిటి నాతి నిన్నుఁ బిలిచె

చ. 3: సురపతిపేరిట్టి సరులు ధరించి
శిరుల మౌనిపేరి జీవముఁబట్టి
పారి నీటిపేరిపొన్నున శ్రీవెంకటనాథ
విరిమీఁదిబిడ్డపేరి వెలఁది నిన్నుఁ గూడె.

చి.శృం.రేకు: 20-5 రామక్రియ సం: 10-118

పల్లవి: చెప్పకురే వానిసుద్ది చెలులాల
వొప్పులు సేసిన తనవోజలు మానీనా

చ. 1: తా నేవూరు నే నేవూరు తల మనవే చాలు
మానరాని వావు లేల మాకుఁ జెప్పీని
మోనాన నూరకుండరే మొన్నటివాఁడు గాఁడా
వూని గరివడ్డగింజ వుడుకఁ బోయ్యీనా

చ. 2: యెక్కడి కెక్కడిపొందు లేలా మొక్కులుమొక్కి
దక్కినట్టి బాస లెల్లఁ దలపించీని
తక్కరించె నిన్నటి తగవరి తానె కాఁడా
ముక్కువైనా చిలుక మానీనా గుణము

చ. 3: యెంత కెంత మందెమేళ మిట్టె సంగతి నుండి
కాంతుఁడు న న్నేమిటికిఁ గాఁగిలించీనె
వింత లేక నన్నును శ్రీవెంకటనాథుఁడు గూడె
యెంత సేసినాఁ జక్కెర యేల తీపు మానును.

చి.శృం.రేకు: 20-6 సాళంగనాట సం: 10-119

పల్లవి: అందు కేమి దోసమా అయితే నేమి
కందువై లోకములోనఁ గలదే కాదా

చ. 1: వలచి యిందిరాదేవి వన్నెలుఁ జక్కఁదనాలు
తలఁపులో నేపొద్దూఁ దలపోయఁగా
సలిగెతోడుత నాపె సారూప్య మందినట్లు
నలు వై గోవిందుఁడే నారాయణి యాయను

చ. 2: బాలకి యై లకిమమ్మ పైపై శిగ్గువడఁగా
తేలించి యాపె మనసు తెలియఁ బూని
చాలా వేడుక నాకె సకియె యుండినటు
ఆలికిఁ గా భువనమోహనరూప యాయను

చ. 3: యెడయ కింతులలో మే లెల్లాఁ దెలియఁ బూని
కడఁగి యాఁడురూపము గైకొని చూచి
బడినె తనకు నెందూఁ బతిలేనివాఁడు గాన
కడ గోవిందుఁడే శ్రీవెంకటనాథుఁడాయను